ఇరువది యారవ

# ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ

## క్యాతూరు (తెలంగాణము)

౧౯౪౬ మార్చి ౧, ౨, ౩




ప్రకాశకులు

ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము

పటమటలంక (వయా) బెజవాడ

# ప్రబోధగీతము

శ్రీయుత ముక్కామల్ల నాగభూషణంగా

తాళము త్రిశ్రజాతి త్రిపుట



కల్యాణి

తెలుగుతేజము దీప్తిచెందగ తెలుగువెలుగులు దిశలనిం
తెలుగుతల్లిని కొలువ దీక్షతో తరలిరావోయ్ తమ్ముడ

మోహన

జీవనదులౌ కృష్ణగౌతమి శ్రీపినాకిని తుంగభద్రలు
కులనగంబులవగిదినొప్పెడు నల్లమలలును పాపికొండలు
ఘనవనంబులు గనులు మిక్కిలి గణుతిగాంచిన యోడరే
మేల్మిబంగరు తెలుగుతల్లికి మేనిభూషలు తమ్ముడా

భైరవి

శకపురుషుడౌ శాలివాహను శౌర్యసాహసులు చాళుక్
కాకతీయుల కదనతలముల కృష్ణరాయల జైత్రయాత్రల
అరిభయంకరులై నిపుణులై అసమసాహస మెసగవైరుల
తెసిమసంగిన తెలుగువీరుల ఘనతపాడర తమ్ముడా

బేగడ

సిద్ధనాగార్జునుని కొండ ప్రసిద్ధికెక్కిన బౌద్ధశిల్పము
అమరకీర్తివిరాజితం బమరావతీ స్థూపాలశిల్పము.
సరిగమల క్రమమెడలకుండగ స్వరములలికెడు హంపిశిల్ప
గనుగుశిల్ప కళాప్రపూర్ణత తెలుపుచున్నవి తమ్ముడా

కేదారగౌళ

ఆంధ్రభారత గ్రంథరచనా పండితుడు తిక్కన కవీంద్రుడు
మేటితంబుర మీటిరాగము లాలపించిన త్యాగరాజును
సరళపథముల జేర్చిముత్యపు సరులుగూర్చిన అప్పారావును
తెనుగుసాహిత్యంపు [illegible]

# ప్రకాశకుల విజ్ఞప్తి

౧౯౪౪వ సం. ఆగష్టునెలలో సింగరేణి కాలరీస్‌నందు జరిగిన ఇరువదియైదవ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ తెలంగాణమునను, ఉత్తరసర్కారులలోను గల గ్రంథాలయ సేవకుల సమావేశమునకు అవకాశమును కల్పించి ఆంధ్రగ్రంథాలయోద్యమములో చిరకాలముగ నిలచియున్న ఒకలోటును తీర్చుటకు పునాది వేసినది. ౧౯౪౬వ సం. మార్చిలో క్యాతూరులో సమావేశమైన ౨౬వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభకు రాయలసీమ గ్రంథాలయ సేవకులుకూడ అధికసంఖ్యలో హాజరు కావడముతో విశాలాంధ్రంలోని ప్రధాన ప్రాంతముల గ్రంథాలయసేవకులందరూ కలసికోవడం సంభవించింది. దీనికి తగినట్లుగానే మహాసభనిర్వహణంకూడ చాలా వైభవోపేతంగా సాగింది. ఆహ్వాన సంఘంవారు సుమారు రు ౪౦౦౦-౦-౦ వరకూ వసూలుచేసి ఖర్చు పెట్టినారు. రాజాబహద్దరు వారి రాకమూలంగా యేర్పడిన పరిస్థితుల కనుగుణంగా జరిగిన బ్రహ్మాండమైన యేర్పాటుల వలన మహాసభ సంచిక అచ్చునిమిత్తం వాగ్దానం చేసిన రు ౧౦౦౦-౦-౦ యివ్వడానికి ఆహ్వానసంఘంవారి కవకాశం లేకపోయింది. ఈపరిస్థితిని గమనించి ఆహ్వాన సంఘాధ్యక్షులు శ్రీ సురవరము రంగారెడ్డిగారు తాము స్వయముగా దీనినిమిత్తం రు ౧౦౦౦-౦-౦ తమ స్వంతద్రవ్యము నుండి ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘానికి విరాళముగ నిచ్చి అన్నమాటను చెల్లించుకొన్నారు. దీనికి మేము శ్రీ రంగారెడ్డిగారికి మిక్కిలి కృతజ్ఞులము.

౨౫, ౨౬ మహాసభల సంచికలను కలిపి ముద్రించుటకు మొదట సంకల్పించితిమి. సకాలంలో ౨౬వ మహాసభ నివేదికలు వగైరా మాకు చేరనికారణంచేత ముందు ౨౫వ మహాసభ సంచికను ప్రకటించితిమి. స్థలాభావముచేత ౨౫వ మహాసభ సంచికలో చేర్చక విడిచిన శ్రీ కోదాటి నారాయణరావుగారి 'నిజాంరాష్ట్ర ఆంధ్ర గ్రంథాలయోద్యమము' అనే వ్యాసాన్ని యీసంచికలో చేర్చినాము. ౨౬వ మహాసభ శాఖాసమావేశాల అధ్యక్షు లెవ్వరును తమ ఉపన్యాసములను వ్రాసియివ్వనందున వీటిని ప్రచురించుట సాధ్యపడ లేదు. ఈసంచిక చివరను నిజాంరాష్ట్రములోని ఆంధ్ర గ్రంథాలయముల పట్టి

ప్రచురించుటకు కొంతకాలము పట్టును గనుక దీనిని తరువాత నెమ్మదిగ పూర్తిచేయు సంకల్పముతో యిప్పటికి విరమించుకొంటిమి.

## కృతజ్ఞత

మహాసభ నిర్వహణలో భాగస్వాములుగనున్న పిన్నలకూ, పెద్దలకూ మేము మిక్కిలి కృతజ్ఞులము. పెద్దతనములో నుండికూడ మా ఉత్సాహమును భంగపుచ్చుట కిష్టము లేక, శ్రమకోర్చి సభకువచ్చి సభాధ్యక్షతను నిర్వహించిన శ్రీ రాజాబహద్దరు వారికీ, సభను ప్రారంభించిన మాడపాటి తాతగారికీ, మహాసభవిజయానికి మొదటినుండి తుదివరకూ పాటుబడ్డ శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారికీ, సభానిర్వహణ భారాన్ని పూర్తిగా తలదాల్చిన ఆహ్వానసంఘాధ్యక్షులు శ్రీ సురవరం రంగారెడ్డిగారికీ, వీరికన్ని విధముల చేదోడు వాదోడుగానుండి పనిచేసిన ఆహ్వానసంఘకార్యదర్శులు శ్రీ మారం నరసింగారెడ్డి, గడియారం రామకృష్ణశర్మ గార్లకూ, సభాకార్యక్రమం నిమిత్తం విరివిగా విరాళముల నిచ్చిన క్యాతూరుచుట్టు ముట్టుపల్లెల పెద్దలకూ మా హృదయపూర్వక నమస్కారములు. వ్యయప్రయాసలకోర్చి మహాసభకు వచ్చిన ప్రతినిధులకూ, శాఖాసమావేశముల చర్చలు వగైరాలలో పాల్గొన్న పెద్దలకూ, వీని అధ్యక్షకార్యదర్శులకూ, మహాసభ స్వచ్ఛంద సేవాదళసభ్యులకూ — ఇందుముఖ్యముగ గద్వాలనుండి వచ్చిన యువక విజ్ఞానసమితివారికీ, మహాసభ విజయాన్ని కాంక్షిస్తూ శుభసందేశములు పంపిన పెద్దలకూ, ప్రదర్శనంలో పాల్గొన్న వివిధ సంఘాలకూ, వ్యక్తులకూ, ఈసంచికను సకాలములో ముద్రించియిచ్చిన తెనాలి భారతీప్రెస్ యజమానులకూ మా ప్రణామములు.

ఈవిజ్ఞప్తిని అచ్చుకిచ్చేముందు ఆహ్వాన సంఘకార్యదర్శులలో నొకరగు శ్రీ మారం నరసింగారెడ్డిగారు పంపిన రు ౩౫౦-౦-౦ మాకు చేరినవి. ఉండవల్లిపౌరులు మహాసభనిర్వహణ సందర్భమున ఈ మొత్తము నిచ్చినట్లు తెలిసినది. సకాలములో దీనిని మాకందజేసిన శ్రీ నరసింగారెడ్డిగారికి మా ధన్యవాదములు.

పటమటలంక } పాతూరినాగభూషణం
౩౦-...


౨౦వ. ఆంధ్రదేశగ్రంథాలయమహాసభ

# సందేశములు (Messages)

"....ప్రకృతమున ప్రసరించుచున్న లోకాభివర్ధక వ్యవహారములలో తక్కినవానికి గ్రంథాలయవ్యాపనము తీసిపోవునదికాదు. అగ్రగణ్యమని నాతలంపు. అన్నింటికినిది పునాది. పూర్వకాలపు గురుకులములకిది ప్రతినిధి. బమ్మెరపోతనార్యుడు గ్రంథభాండాగార వనవాటికయందే నిజబుద్ధికి విందుగుడిపి, సహజపాండిత్యుడై, జగద్విఖ్యాతమైన భాగవత పురాణమూలమున, దేశమండలి యాబాలగోపాలము నానంద రసాబ్ధి నోలలాడించు చున్నాడు. నవనవోత్తేజిత మగుచున్న ఈనాటి గ్రంథమందిరము లెందరినో బహుళవిజ్ఞాన పరిపూర్ణుల వెలువరించవలసి యున్నది. ఈకాలమునకు వలయు పుస్తకములు అందుముఖ్యముగా వృత్తి విద్యలకను వగునవి పలుతెగలు సమకూడవలసి యుండును. పుస్తకాలయములు, వయోజనులకు శీఘ్రకాలమున విద్యానుగరపు సాధనములుగా జేయనుపాయము లాలోచింపవలెను. ఇంకను ఉపేక్షింపరానిదొకటి. భౌతికాభివృద్ధియందు మాత్రమే వ్యగ్రోత్సాహులై యుండక, ఆత్మోజ్జీవన సాధకములగు నుత్తమగ్రంథసంపుటముల సేకరించి వానిని క్రమపద్ధతిని వినియోగించుచు, జనులయాత్మల నిరామయముల నొనరింపవలసిన భారము గ్రంథాలయసేవకుల కెంతేని కలదని మనవి చేయ సాహసించు చున్నాడను.

క్యాతూరిసభ నిరంతరాయముగా, జయప్రదముగా ముగిసి, దేశమునకు, సర్వోత్తమసందేశము నొసంగెడునని యాశించుచున్నాడను. అనుక్షణము సర్వేశ్వరుడు మీ సభకు తోడ్పడుగాక!

(సం) పుతుంబాక సీతారామయ్య,
పెదపాలెము, తెనాలితాలూకా.

"... ప్రప్రథమమున భారతదేశ గ్రంథాలయోద్యమ చరిత్రకు శ్రీకారము చుట్టినది ఆంధ్రగ్రంథాలయోద్యమమే యని సర్వవిదితము. ఐనప్పటికిని, ఆంధ్రదేశ గ్రంథాలయములందు తప్పక నిక్షేపములుగా నుండదగిన అముద్రితాంధ్ర గ్రంథములెన్నో కొఱవడియుండుట కడుం

గడు శోచనీయాంశము. ఈవిషయమై, యీమహాసభ తీవ్రమైన కృషి చేసి ఫలసిద్ధి పడయగలదని మాఆశ.

ప్రవాసాంధ్రులమైన మాకు సరియైన గ్రంథాలయమేదియు అందుబాటులో నుండదు. అట్టితరి విజ్ఞానార్థులమై మేము సంశయ నివారణమునకై ఆంధ్రదేశ గ్రంథాలయ సహాయ మర్థించవలసి యుండును. మామాతృదేశమైన ఆంధ్రదేశమందుగల ఏదొక్క ఉత్తమ గ్రంథాలయమైనను మాసంశయములను శేఖామూలముగ తీర్చుటకు సంకల్పించుకొనుట సమంజసమని మాయుద్దేశము.

ప్రవాసాంధ్రుల కోరికలను యీమహాసభ తీర్చగలదనియు, ఈ ౨౧ వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభాసమావేశము విజయ వంతముగా సాగునని యును మాదృఢవిశ్వాసము.

జెమ్షెడ్పూరము ఆంధ్రవిజ్ఞానసమితిపక్షమున
(సం.) వ. కాళిదాసు

"... గ్రంథాలయోద్యమము ఆంధ్రుల అభిమానోద్యమము. అందు తెలంగాణమున ముఖ్యముగ యీగ్రంథాలయోద్యమమే నేటి రాజకీయాంధ్రోద్యముగ పుష్పించినది. నేను చాలకాలమునుండి

సర్కారాంధ్రులు — రాయలసీమా—
తెలంగాణమూ— మారాడూకలసీ—
అంతాఒకటే — ఆంధ్రులమంచునూ—
ఢంకావిూదా — దెబ్బకొట్టుచూ—
చాటరవెరుపక — ఆంధ్రుడవైతే. అనిపాడుచున్న విష

యము మీరెరుగకపోరు. అట్టి విశాలాంధ్రభావమే యిటీవల పలువురు నైజామీయులును, బ్రిటిష్ఆంధ్రులును వాంఛించుచున్నారు. ఇటీవల బ్రిటిష్ పరిపాలనయే యీఆంధ్రైక్యతను విచ్ఛిన్న మొనర్చినది. అంతకు పూర్వమెన్నడును మనమందరమొకే ఛత్రఛాయక్రింద నున్నటుల చరిత్ర చాటుచున్నది. తిరిగి యెన్నటికైనను అట్టి ఆంధ్రైక్యత మనకు సిద్ధించునెడల నేటి మీగ్రంథాలయమహాసభలు అట్టి ఐక్యతకు మార్గదర్శకములగును. కాని నైజామ్ ఆంధ్రులైనను, బ్రిటిష్ఆంధ్రులైనను

యీ గ్రంథాలయోద్యమ ప్రచారకు లీయుద్యమము నెట్టివిధముగను రాజకీయములతో ముడిపెట్టకుండుట వీరిధర్మము... ..."

సభలు దిగ్విజయముగ జరుగుగాక!

(సం.) గుమ్మిడిదల వెంకటసుబ్బారావు
గోష్ఠి అధ్యక్షుడు, బెజవాడ

"...శ్రీరాజా బహదూర్ వారి ఆధ్వర్యమున మహాసభ జరుగుట మోదమును దోహదమును గూర్చి జయప్రదమును సూచించుచున్నది. అఖండజయముతో మహాసభ పూర్తియగుగాక... గ్రంథాలయోద్యమ సేవకులకు నాయభివాదములు."

(సం.) బెజవాడ రామచంద్రారెడ్డి
బుచ్చిరెడ్డిపాలెం, నెల్లూరుజిల్లా

"...గ్రంథాలయోద్యమమునందు నైజాంరాష్ట్రంలోని మన ఆంధ్ర సోదరులకుగల ఆదరాభిమానములు మెచ్చతగినవి. సభ జయప్రదముగ నిర్వర్తింపబడునని ఆశించుచున్నాను. ... ౨౭వ మహాసభ రాయల సీమలో జరిగిన మేలుగా నుండునని తలతును."

(సం). సూరపరాజు కోటయ్య
నెల్లూరుజిల్లా గ్రంథాలయసంఘ కార్యదర్శి

"౨౫ వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ శ్రీరెడ్డిరాజుల కీర్తిని స్మరింపజేయుచు విజయవంతముగ జరుగుగాక. సంఘము శక్తివంతమై వాడవాడల గ్రంథాలయముల నెలకొలుపుగాక. సంఘసేవకులు స్వార్థ రహితులై మానవసేవకు దీక్షబూనెదరుగాక. నిరక్షరాస్యత నిర్మూలించి జ్ఞానభాస్కరుని దర్శించి ఆనందింతురుగాక."

(సం.) పీ. వేం. కృష్ణమాచార్యుడు
విశాఖపట్టణజిల్లా గ్రంథాలయసంఘ కార్యదర్శి

"...మనరాష్ట్రములో శ్రీరాజాబహదరు వెంకటరామారెడ్డిగారి ఆధ్వర్యములో జరుగు సభ అతివైభవముతో జరుగుట సహజమే ...

"మహాసభ జయప్రదముగ జరుగవలెనని కోరుచున్నాను."

(సం.) అయ్యదేవర కాళేశ్వరరావు
విజయవాడ

"మహాసభకు నాఆశీస్సులను తెలియపరచవలెను."

(సం.) తేకుమళ్ల రామచంద్రరావు
కృష్ణా జిల్లా గ్రంథాలయ సంఘాధ్యక్షులు

మహాసభ విజయానికై దేవుని ప్రార్థిస్తూ సందేశముల పంపినవారు:

శ్రీ పోలేపల్లి వెంకన్నశ్రేష్ఠిగారు, వల్లూరు, కడపజిల్లా
శ్రీ మణుగూరు టి. గురుమూర్తిగారు, హిందూపురం
శ్రీ గొండ్యాల పెంటయ్యగారు, హైదరాబాదు
శ్రీ మల్లెల శ్రీరామమూర్తిగారు, బెజవాడ
శ్రీ వేగేశన నారపరాజుగారు, పాందువ్వ. ప. గోదావరి
శ్రీ ఎ. రాయప్పగారు, తిమ్మంచర్ల, అనంతపురంజిల్లా
డా॥ సేవూరి యల్లమందయ్యగారు, పెరవలి, కర్నూలుజిల్లా

"Man does not live by bread alone. He needs ideas as well, which are the vitamins of life. The spread and communication of ideas is as important as the writing of books. Hence the Library Movement is a valuable form of social and national service, especially in our country, where the bulk of the population is far removed from the centres of learning.

I wish the conference every success."

(Sd). J. L. Devi,
Rani Lalitadevi of
Gopalpet Samsthanam

"......It is needless for me to say that the vital need of the hour is education, education and more education and I appreciate highly the good work that your Mahasabha is doing in that behalf. With the earnestness of Mr. Pratapa Reddy and the wise

counsel of Raja Bahadur Venkatrama Reddy I have absolutely no doubt that the conference will be extremely successful. I wish the conference every success."

(Sd.) S. Aravamudu Aiyangar
Medical Member of the
Nizam's Government.

"......I wish the Conference all success."

(Sd.) B. S. Murthy

"......I wish the conference every success."

(Sd). K. V. K. Aiyar,
President,
Madras Library Association.

"......We should concentrate on Library Legislation. Now the popular governments are being set up in the provinces, we must do all we can to do better by the library cause, so that our people may have a chance for universal, perpetual self education and thus contribute to the happiness of themselves, of our nation as a whole and of the world in general. Two model acts - one with compulsory clauses and the other with optional clauses - had been published the one by the Madras Library Association and the other by the Indian Library Association. Pursue the Act with singlemindedness. The other things will follow."

(Sd.) S. R. Ranganathan,
President,
Indian Library Association;
Secretary,
Madras Library Association.

# విషయసూచిక

## పటములు

# ౨౬ - వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ

## క్యాతూరు, అలంపూరుతాలూకా

౧౯౪౬ మార్చి ౧ వ తేదీ మధ్యాహ్నం ౨-30 గంటలకు గ్రంథాలయ ప్రదర్శనావిష్కరణంతో ౨౬ వ ఆంధ్రదేశగ్రంథాలయ మహాసభా కార్యక్రమము ప్రారంభమైనది. ఈప్రదర్శనాన్ని తెరుస్తూ ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘోపాధ్యక్షులు శ్రీ సురవరము ప్రతాపరెడ్డి, బి.ఏ., బి.ఎల్. గారు వివిధ దేశాలలోని విద్యాపరిస్థితులను మనదేశపు విద్యాపరిస్థితితో పోల్చి, ఇచ్చట విద్యాప్రచారానికి గ్రంథాలయాల ఆవశ్యకతను వివరించిరి. మామూలు గ్రంథాలయ ప్రదర్శనంతోపాటు యీ సంవత్సరం వ్యవసాయ, ఆరోగ్య, పశువైద్యములకు సంబంధించిన ప్రచార సాధనాలనుకూడ ప్రదర్శనంలో చేర్చడంద్వారా పల్లెప్రజలకిది చక్కగా ఉపకరించగలదనిరి. ప్రదర్శనంలో తామిదివరకు చూడని గ్రంథములు కూడ కొన్ని యున్నవనిరి. గ్రంథాలయనిర్వాహకులు తమ తమ గ్రంథాలయాలలో యేలాటిగ్రంథాల నుంచుకోదగునో ఆ విషయమై చక్కని సూచనల చేసిరి.

### ప్రారంభ సమావేశము

సాయంత్రం గం ౬-30 లకు అధ్యక్షులైన శ్రీ రాజాబహద్దర్ వెంకట్రామారెడ్డిగారి వూరేగింపు ౨౬ ఎడ్లుగల రాతిరథముపై బ్రహ్మాండంగా జరిగింది. గం ౭-30 లకు వందేమాతరం గేయంతోనూ, హిందూస్థాన్ హమారా గేయంతోనూ మహాసభనిమిత్తం ప్రత్యేకంగా నిర్మించిన పందిరిలో సభాకార్యక్రమము ప్రారంభమైనది.

శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు శ్రీరాజాబహద్దర్ వెంకట్రామారెడ్డిగారిని సభికులకు పరిచయంచేస్తూ వారిని అధ్యక్షులుగా ప్రతిపాదించారు. శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారు యీప్రతిపాదనను బలపరిచారు. అంతట శ్రీ రాజాబహద్దరువారు అధ్యక్షత వహించారు.

ఆహ్వాన సంఘాధ్యక్షులు శ్రీ సురవరం రంగారెడ్డిగారు తమ స్వాగతోపన్యాసం చదివారు. గడియారం రామకృష్ణ శర్మగారు స్వాగత పద్యం చదివిన తరువాత శ్రీ కోదాటి నారాయణరావుగారు ఆంధ్రపితామహులైన శ్రీ మాడపాటి హనుమంతరావుగారిని పరిచయం చేస్తూ సభాప్రారంభోత్సవం చేయకోరారు.

శ్రీ మాడపాటి హనుమంతరావుగారు మహా సభను ప్రారంభిస్తూ యిట్లా సెలవిచ్చారు. "ఆంధ్రదేశంలో గ్రంథాలయోద్యమం గత 30 సంవత్సరాలలో మహత్కార్యాన్ని సాధించినసంగతి నేను స్వయంగా ఎరుగుదును. నైజాంరాష్ట్రములో ఆంధ్రోద్యమ నిర్మాణం చేయటానికి బ్రిటిషు ఆంధ్రదేశంలోని ఇతర ఉద్యమాలవారు ప్రత్యక్షంగా తెలంగాణాలోకూడా సేవచేయడం ప్రారంభించారు. గత ౨౮ మహా సభలకును, తెలంగాణాలో జరిగిన ౨౧, ౨౩ మహాసభలకును చాలా మార్పులు చేశారు."

తమ ఉపన్యాసాన్ని సాగిస్తూ శ్రీ హనుమంతరావుగారు యింకా యిలా చెప్పారు. "ఆంధ్రులమంతా ఎక్కడున్నా ఒక్కటే. మన చరిత్ర, భాష, సంస్కృతి, సభ్యత అన్నీ ఒకటే. పరిపాలనరీత్యా వేరే వేరే ప్రభుత్వాలకు చెందినవారం కావటం వల్ల రాజకీయాలు వేరైనప్పటికీ మిగతా అన్ని విషయాలు మనఅందరికీ సమానమే. గ్రంథాలయోద్యమ సాహచర్యంవల్ల మనమంతా విశాలాంధ్ర భవిష్యనిర్మాణానికి తోడ్పడగలమని ఆశిస్తున్నాను."

శ్రీ రాజాబహద్దర్ వెంకట్రామారెడ్డిగారు మహాసభకధ్యక్షత వహిస్తూ తమచిన్నతనంలో వారు విల్లంబుల పట్టుకొని క్యాతూరు వచ్చినసంగతి జ్ఞాపకం చేశారు. పూర్వకాలానికీ యిప్పటికీ గ్రామాలలో గలిగిన అభివృద్ధిని వివరించి చెప్పారు. నిజాంప్రభువుల ఛత్రఛాయను ప్రతిగ్రామంలో గ్రంథాలయము యేర్పడాలనీ, ప్రతి రైతుకూ అది అందుబాటులో ఉండాలనీ, వ్యవసాయక గ్రంథములు ఎక్కువగా తెప్పించాలనీ ఆశించారు గ్రంథాలయోద్యమ సేవకు

లంతా ఉద్యమసేవచేసే నిమిత్తము ఈశ్వరుడు ఆయూరారోగ్య అభి వృద్ధి చేయవలెనని ప్రార్థిస్తూ ముగించారు.

అధ్యక్షోపన్యాసము తరువాత సంఘ ప్రధానకార్యదర్శి శ్రీ పాతూరి నాగభూషణంగారు స్వర్ణోత్సవ-తారణ సం॥ల నివేదికలోని విషయాలను సంగ్రహంగా నివేదించారు.

తెలంగాణా కార్యాలయము అప్పటివరకు నిర్వర్తించినపనిని తెలంగాణా ప్రాంతీయ కార్యదర్శి శ్రీ కోదాటినారాయణరావుగారు నివేదించారు.

శ్రీ రాజాబహద్దరు వెంకట్రామారెడ్డిగారు ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘానికి ఈసందర్భములో రు ౧౦౦ లు విరాళం యివ్వడానికి వాగ్దానం చేశారు.

రాత్రి ౯ం ౬-౩౦ లకు ఆనాటికి సభ ముగిసింది.

## ప్రచారశాఖా సమావేశము

౨-౩-౪౬ వ తేదీ ఉదయం ౧౦ గంటలకు మహాసభ ప్రచారశాఖా సమావేశం మహాసభ మండపంలో జరిగింది. దీనికి శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు అధ్యక్షత వహించారు. ఈసమావేశము శ్రీ వెంకట రెడ్డిగారి ప్రార్థనగీతముతో ప్రారంభమైనది. శ్రీ మారేపల్లి రామచంద్ర శాస్త్రిగారు సమావేశాధ్యక్షులైన శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు గారిని సభికులకు పరిచయంచేస్తూ, వారు గత నలుబదిసంవత్సరాల నుండీ చేస్తున్న సేవను ఉగ్గడించారు. అధ్యక్షులు గ్రంథాలయోద్యమ ప్రచారాన్ని గురించి కొన్నిమాటలు చెప్పినతర్వాత గద్వాలసంస్థాన యువకసంఘాధ్యక్షులు శ్రీ భీమేశ్వరరెడ్డిగారు గ్రామసేవను గురించి ఉపన్యసించారు. ఈ ఉపన్యాసంలో ప్రాచీనగ్రామ వ్యవస్థను, నేటి దుస్థితిని చక్కగావివరించి, భావిభారతరాజ్యాంగానికి గ్రామం ఏవిధంగా ప్రాతిపదిక కాగలదో రెడ్డిగారు వివరించారు. గ్రంథాలయసేవ గ్రామ సేవలో నొక అంగంగా నుండవలెనని వారు నొక్కిచెప్పినారు.

అంతట వ్యాసపఠనము, చర్చలు ప్రారంభమయినవి. తెలంగాణా ప్రాంతీయకార్యదర్శి శ్రీ కోదాటి నారాయణరావుగారు ఆంధ్రదేశ గ్రంథాలయసంఘానికి గ్రంథాలయోద్యమ ప్రచారమునకు సంబంధించిన కొన్ని సూచనలు చేస్తూ ఒకవ్యాసమును చదివారు. దానిపై చర్చలో శ్రీయుతులు మారేపల్లి రామచంద్రశాస్త్రి, పాతూరి నాగభూషణంగార్లు పాల్గొన్నారు శ్రీ చీదర్ల సత్యనారాయణగాంధీగారు పంపిన "దేవాలయాలు" అనే వ్యాసాన్ని ఈ సమావేశ కార్యదర్శి శ్రీ బసవరాజు జగన్నాథరావుగారు చదివారు. శ్రీ పాతూరి నాగభూషణంగారు "గ్రంథాలయోద్యమ ప్రచార ప్రణాళిక" అనే వ్యాసాన్ని చదివారు. సంఘకోశాధ్యక్షులు శ్రీ కొమ్మూ సీతారామయ్యగారు విశాలాంధ్రమున గ్రంథాలయోద్యమ ప్రచారాన్ని గూర్చిన తమ ఆలోచనలను సభవారికి తెలియపరచినారు. శ్రీ రామకృష్ణశర్మగారు ప్రబోధపద్యములు చదివినారు.

మహాసభాధ్యక్షులు శ్రీ రాజాబహద్దరు వెంకటరామారెడ్డిగారు తాము మరునటిదినము హైద్రాబాదుకువెళ్లుతూ వున్నందున తమ అంత్యోపన్యాసాన్ని ఈ సమావేశంలోనే ముగించారు. శ్రీరాజా బహద్దరువారు తమ ఉపన్యాసంలో ఈ మహాసభ చూచినతర్వాత తమకు ప్రయాణంవల్ల కలిగినశ్రమ తీరిందన్నారు. గ్రామీణుల కష్టాలను పూసగుచ్చినట్లు చెప్పుతూ, పల్లెప్రజలు గ్రంథాలయోద్యమము ద్వారానే తమ కష్టనివారణోపాయాన్ని తెలుసుకోవచ్చునని శ్రీరాజా బహద్దరువారు గట్టిగ చెప్పారు. ఆహ్వానసంఘాధ్యక్షులు శ్రీ రంగారెడ్డిగారిని గ్రామంలో ఒక బాలికాపాఠశాలను, స్త్రీలకొక గ్రంథాలయమును కట్టించవలసినదని కోరినారు శ్రీరంగారెడ్డిగారు అందులకు సమ్మతించినారు. శ్రీరంగారెడ్డిగారు బాలికాపాఠశాలను నిర్మిస్తే తాము స్త్రీలకొక గ్రంథాలయాన్ని కట్టించియిస్తామని ఆహ్వానసంఘ కార్యదర్శి శ్రీ మూరం నరసింగారెడ్డిగారు వాగ్దానం చేశారు. శ్రీ రాజా బహద్దరువారి ఆదేశానుసారము సభలో విరాళములు ప్రోగుచేయబడినవి. శ్రీరాజా బహద్దరువారి ఉరుదు ఉపన్యాసాన్ని శ్రీ మాడపాటి హనుమంతరావుగారు తెలుగులోనికి అనువదించినారు.

శ్రీ మహామ్మదు గ్యాజీగారు ఆంధ్రభాష, గ్రంథాలయోద్యమములనుగూర్చి చక్కని ఉపన్యాసమిచ్చిరి. ప్రచారశాఖాసమావేశాధ్యక్షుల సమీక్షతో ఈ సమావేశము ముగిసినది.

## నిర్వహణశాఖా సమావేశము

గ్రంథాలయ నిర్వహణశాఖా సమావేశం మార్చి ౨ వ తేదీ సాయంత్రం ౬ గంటలకు ఆంధ్రదేశగ్రంథాలయసంఘ ప్రధాన కార్యదర్శి శ్రీ పాతూరి నాగభూషణం గారి అధ్యక్షతను ప్రారంభమైనది. శ్రీ కోదాటి నారాయణరావుగారు అధ్యక్షులను సభికులకు పరిచయము చేశారు. అధ్యక్షులు తమ ప్రారంభోపన్యాసంలో గ్రామగ్రంథాలయాలలో నుండవలసిన ముఖ్యమైన పట్టికలనుగూర్చి సభవారికి విశదీకరించారు. తరువాత శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు గారు 'ఆచూకీ సేవ' (Reference Service)ను గురించిన వ్యాసాన్ని చదివి వ్యాఖ్యానంచేశారు. శ్రీ గోవరాజు రామచంద్రరావు గారు పుస్తకాలకు వలెనే వార్తాపత్రికలకుకూడ ఆచూకీసేవ అవసరమని తెలిపినారు. శ్రీ కోదాటి నారాయణరావు గారు దీనిని బలపరుస్తూ ఖమ్మంమెట్టు (తెలంగాణము) లో కొందరు యువకులు ఈవిషయమై చేస్తున్న కృషిని వివరించారు. తెలంగాణా గ్రంథాలయ సేవకులు కొందరు అచ్చటి గ్రంథాలయాల రిజిస్ట్రేషను, అచ్చటచ్చట కొందరు వ్యక్తులు గ్రంథాలయాలపై సాగిస్తున్న దురాక్రమ విధానములకు సంబంధించి అడిగిన కొన్ని ప్రశ్నలకు శ్రీ నారాయణరావు గారు జవాబులు చెప్పారు.

౧౯౪౭గి జూన్ నెలలో ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘంవారు జరిపిన గ్రంథాలయ ప్రవేశపరీక్షలో ఉత్తీర్ణులైన విద్యార్థులకు యోగ్యతాపత్రములనిస్తూ శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి గారు ప్రాచీన భారతీయ వైజ్ఞానిక ఔన్నత్యాన్ని గురించి - ముఖ్యంగా ఆంధ్రులు చేసిన కృషిని వివరిస్తూ, విజ్ఞానం యొక్క ఆదర్శాన్ని చక్కగా వెల్లడించారు. ఉత్తమాదర్శముల నలవరచుకొని, విజ్ఞాన ప్రచారాన్ని చేయవలసినదిగ తమ స్నాతకోపన్యాసంలో వీరు విద్యార్థులను ప్రబోధించారు.

అధ్యక్షుల ఉపసంహార వాక్యముల అనంతరం కార్యదర్శి శ్రీ కొమర్రాజు సత్యనారాయణరావు గారి వందన సమర్పణముతో ఈసమావేశ కార్యక్రమం ముగిసింది.

## సారస్వత పరిషత్ సమ్మేళనము

ఈసమావేశం పూర్తియవుతూనే నిజాంరాష్ట్ర ఆంధ్ర సారస్వత పరిషత్తు, మహబూబునగరు జిల్లా శాఖాసమ్మేళనం సురవరం ప్రతాప రెడ్డిగారి అధ్యక్షతను జరిగింది. శ్రీ అనుముల వేంకటసుబ్రహ్మణ్య శాస్త్రి, గడియారం శేషశాస్త్రి మొదలైన సుప్రసిద్ధ కవులు, పండితులు పలువురు దీనిలో పాల్గొన్నారు. ఈసమావేశానికి ప్రత్యే కంగా లోకనంది శంకరనారాయణరావుగారు ఆదవానినుండి వచ్చారు.

రాత్రి ౧౧ గంటలకు విషయనిర్ణయసభ జరిగింది. మహాసభలో ప్రవేశపెట్టే తీర్మానాలపై చర్చజరిగింది.

## వయోజన విద్యాశాఖా సమావేశము

3-3-౪౬ వ తేదీ ఉదయం ౯ గంటలకు వయోజన విద్యాశాఖా సమావేశం శ్రీ గోపరాజు రామచంద్రరావుగారి అధ్యక్షతను సభా మంటపంలో పాతూరి నాగభూషణంగారి వయోజన విద్యాగీతంతో ప్రారంభమైనది. శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు సభికులకు రామచంద్రరావుగారిని పరిచయం చేశారు.

అధ్యక్షుల ప్రారంభోపన్యాసంలో చర్చకు ప్రాతిపదికగ కొన్ని అంశాలను విదితపరచినారు. అందులో ముఖ్యమయినది "వయోజన విద్యకు ఆదర్శం భావప్రాయను, చదువను మాత్రమేనా? ఇంకా ఏమైన వున్నదా?" అని. దానిని వివరిస్తూ మహాత్మాగాంధీ నైతికజీవి తము, ఆరోగ్యము, స్వాతంత్ర్యసాధన విషయాలలో విశిష్టత నేర్పరచి నట్లే విద్యావిషయంలోకూడా నూతనశకాన్ని ప్రారంభించారనిన్నీ, వారి నిర్వచనప్రకారం విద్యఅంటే అక్షరాస్యతయే కాకుండా మానవుని

దృక్పథాన్ని మార్చివేసి, మానవజీవితాన్ని యిదివరకటికంటె సౌఖ్యప్రదంగా చేయడానికి అవకాశాలను కల్పించడమేఅనిన్నీ చెప్పినారు. వయోజనవిద్యకు ఆదర్శము మనుష్యులంతా ఆర్థిక, రాజకీయ, సాంఘికాది విషయాలలో సమానసహోదాలలో యత్నించుటయేయని వివరించారు. దానికి అక్షరాస్యతయే ప్రముఖసాధనకాదనీ, ఇతర ప్రచార సాధనాలను ప్రధానంగా అవలంబించాలనీ సెలవిచ్చారు. బుర్రకథలు, సుద్దులు, తోలుబొమ్మలు మొదలైనవి విరివిగా ప్రచారములోనికి రావలెనని చెప్పారు. విద్యాస్థాయినిగురించి మహాత్మాగాంధిగారికి గల అభిప్రాయాన్నిగురించికూడా వివరించారు.

తర్వాత శ్రీకొర్రపాటి సుబ్బారావుగారు పంపిన వయోజనవిద్యాపద్ధతుల గురించిన వ్యాసాన్ని శాఖాసమావేశ కార్యదర్శి శ్రీకోదాటి నారాయణరావు గారు చదివారు. శ్రీరామలింగారెడ్డి (చాగలమఱ్ఱి) గారు ఆధారవిద్యనుగూర్చి తమ వ్యాసాన్ని చదివారు. తరువాత జరిగిన చర్చలో అనేకమంది పాల్గొన్నారు. అధ్యక్షులు సూచించిన అంశములపై చర్చలో ప్రధానపాత్ర వహించినవారు శ్రీ హరి సర్వోత్తమరావుగారు. వారీవిధంగా సెలవిచ్చినారు "గ్రంథాలయోద్యమ వయోజన విద్యాప్రచారములలో యిదివరకు అనేక పద్ధతులను ఆచరించి చూచాము. జీవితానికి సంబంధించని అక్షరాస్యతను మేము ప్రోత్సహించుటలేదు. అక్షరాస్యత విజ్ఞానానికి సాధనమని మా నిర్ణయం. అక్షరాస్యతాప్రచారం విస్తృతమైన గ్రంథాలయసేవకు అవసరము. గాంధీజీ అక్షరాస్యతను వద్దనలేదు, పైగా కావలెనన్నారు. అక్షరాస్యతే తారకమని అనుకోరాదు. దీనిమూలంగా మనుష్యులలో కలిగేశక్తి, స్వభావము మార్పు; శీలము ఇవేతారకములు. అక్షరాస్యతాప్రచారము సబబా కాదా? అనేవిషయాన్ని ఆలోచించవలెను. అభివృద్ధి అనేకముఖాలుగా జరుగుతూ వుంటుంది."

శ్రీమారేపల్లి రామచంద్రశాస్త్రిగారు తెలుగు దేశంలో వయోజనవిద్యా ప్రచారం చాలకాలంనుండి సాగుతూ వుందన్నారు. నేటియుగంలో అక్షరాస్యత ప్రజలందరికీ అవసరం. ఓటరుగా చేర

వలసిన వయోజనులంతా అక్షరాస్యులై ఉండడం ముఖ్యం. కనుక అక్షరాస్యతా ప్రచారానికి గ్రంథాలయాలు విధిగా తోడ్పడాలని వీరుపన్యసించినారు.

అయ్యంకి వెంకటరమణయ్యగారు చెవిద్వారాకంటె కన్ను ద్వారా విజ్ఞానప్రచారం చేయడం యెక్కువ ఉపయోగమైన పద్ధతిగా రుజువైనదనీ, వయోజన విద్యా కేంద్రంలో గ్రంథాలయము, పఠనాలయము లేకుంటే ఆ కార్యక్రమం నిరర్థక మవుతుందనీ సెలవిచ్చారు. శ్రీ కోదాటి నారాయణరావుగారు తమ ప్రచారానుభవమును తెలుపుతూ ప్రజానీకాన్ని ఆకర్షించే పద్ధతులను వయోజన విద్యాప్రచారకు లవలంబించాలని చెప్పారు. శ్రీ కొమ్మా సీతారామయ్యగారు త్వరలో ప్రజలు స్వాతంత్ర్యోద్యమానికి తయారుకావాలంటే ప్రచార సాధనాలు ఆకర్షణవంతంగా ఉండాలని చెప్పారు. శ్రీ సి. ఆర్. శర్మగారు బుర్రకథలు వైజ్ఞానిక ప్రబోధానికి బలమైన సాధనాలన్నారు. శ్రీ పాతూరి నాగభూషణంగారు వయోజనులకు ఏదైనా ఒక వాచకాన్ని ఆధారంగా పెట్టుకొని విద్య నేర్పాలనీ, లేకుంటే విధానంలేని కార్యక్రమం వ్యర్థమవుతుందనీ, వయోజన విద్యాబోధకుడు తప్పక శిక్షణ పొందవలెననీ చెప్పారు

అధ్యక్షులు చర్చనంతా సమీక్షచేస్తూ ముందు సాహసించి పని ప్రారంభించవలెననీ, తర్వాత తప్పులుకనిపిస్తే దిద్దుకోవచ్చునీ, చొరవచేసుకొని పనిసాగించుటలోనే సార్థకత వున్నదనీ, ఆకర్షణ ముందుకావాలనీ, ఆకర్షణసాధనాల్లో పత్రికాపఠనం, దేశపటాలు చేరతాయనీచెప్పి ముగించారు. శాఖాసమావేశ కార్యదర్శి శ్రీ కోదాటి నారాయణరావుగారి వందనసమర్పణతో యీ సమావేశం ముగిసింది.

## ముగింపు

3-3-౪౬వ తేదీ సాయంత్రం ౬½ గంటలనుండి మహాసభ తుది సమావేశం శ్రీ పాతూరి నాగభూషణంగారి గ్రంథాలయ ప్రబోధ గీతంతో ప్రారంభమయింది. శ్రీ రాజా బహద్దరు వేంకట్రామారెడ్డిగారు

కార్యాంతరంవల్ల హైద్రాబాదు వెళ్లుతూ, వారిస్థానే అధ్యక్షపదవికి శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారిని నియమించారు. అందుచేత సమావేశం శ్రీ రెడ్డిగారి అధ్యక్షతను జరిగింది.

జనవరి ౨౫, ౨౬, ౨౭ తేదీలలో బరోడాలో జరిగిన అఖిలభారత గ్రంథాలయమహాసభకు ఆంధ్రదేశ ప్రతినిధిగావెళ్లిన శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు ఆ మహాసభకు సంబంధించిన విశేషాలను చెప్పారు. శ్రీ మూర్తిగారు దానిలో ప్రజాసామాన్యానికి యేమీ అవకాశం యివ్వబడలేదని అన్నారు. ప్రభుత్వం మహాసభనిమిత్తం రు ౩౦౦౦ లు విరాళం యిచ్చినప్పటికీ భోజనఖర్చులనిమిత్తం రోజుకు రు ౫లు వసూలుచేసినట్లు చెప్పారు. యావద్భారతదేశంనుంచి ౧౩౫ మంది ప్రతినిధులు వచ్చారు. సభలో మొత్తంమీద పనికంటె విలాసానికే యెక్కువ ప్రాధాన్యం యివ్వబడిందని శ్రీ మూర్తిగారి అభిప్రాయం. బరోడాలో గ్రామగ్రంథాలయోద్యమాన్ని గూర్చి చెపుతూ అచ్చటి గ్రంథాలయోద్యమానికి ప్రభుత్వసహాయం, స్థానిక స్వపరిపాలనా శాఖ సహాయం, ప్రజాసహాయం బాగా వున్నందువలన పూర్వపు మహారాజుగారి కృషివల్లనూ, ఈవుద్యమం బాగా సాగుతున్నదనీ, అయినప్పటికీ ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమానికంటె అచ్చట గొప్పగాజరిగిన దేమీ లేదనీ చెప్పారు. వారు పై సభలో చేసిన ఉపన్యాసంలో ఆంధ్రుల ప్రతిభను, కళాభినివేశాన్ని, ప్రస్తుత వైజ్ఞానికోద్యమాలను వివరించినట్లు తెలిపారు. ఇప్పుడు జరుగుతూవున్న గ్రంథాలయోద్యమాన్నిగూర్చి మాట్లాడుతూ, వేటపాలెం, పెదపాలెం, బెజవాడ, ఖమ్మంమెట్టు మొదలయిన గ్రంథాలయాలను ఉదాహరణంగా పేర్కొన్నారు. అఖిలభారత గ్రంథాలయోద్యమ నాయకులు, హిందూవిశ్వకళాపరిషత్తు గ్రంథభాండాగారిఅయిన శ్రీ రంగనాథన్ గారు తమను బలపరచారనీ, బరోడావారు ముఖ్యంగా గుజరాతీలు ఆంధ్రులయెడ సుముఖులయిన అభిప్రాయాన్ని కనపరచారనీ, స్థానికుల ఉత్సాహంవల్ల నెలరోజులు గుజరాతీదేశంలో పర్యటన గావించి వివిధ ప్రాంతాల్లో ఉపన్యసించామనీ చెప్పుతూ తమ ఉపన్యాసాన్ని విరమించారు.

తీర్మానాలపై చర్చజరిగినతర్వాత అవి అంగీకరింపబడ్డవి. ఆహ్వాన సంఘపక్షమున శ్రీ సురవరం ప్రతాపరెడ్డి, రంగారెడ్డిగారలు, ఆంధ్రదేశ గ్రంథాలయసంఘ పక్షమున శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు, పాతూరి నాగభూషణంగారలూ, తెలంగాణా కార్యాలయపక్షమున కోదాటి నారాయణరావుగారు వందనసమర్పణ గావించారు. శ్రీ వెంకట రెడ్డిగారి మంగళగీతంతో సభ ముగిసింది. ఈ సభాసందర్భంలో ప్రభుత్వపు ఆరోగ్య, పశువైద్య శాఖలవారిచే ఉపన్యాసా లివ్వబడ్డాయి. గద్వాల కర్ణాటకచరఖా సంఘంవారిచేతనూ, వాసుదేవ ఆయుర్వేద ఫార్మసీవారిచేతనూ, ఖద్దరు ఔషధప్రదర్శనాలు జరుపబడ్డాయి.

మంచినూలునుతీసిన రోశమ్మ అను స్త్రీని (గద్వాల) ఆహ్వాన సంఘమువారు సత్కరించారు. గద్వాల స్వచ్ఛందసేవకులు చేసిన సేవను అభినందిస్తూ ఆహ్వానసంఘంవారు గద్వాల యువక విజ్ఞానసంఘం వారికి రు ౫౧-౦-౦ విరాళం యిచ్చారు. సభ రాత్రి ౧౦ గంటలకు జయప్రదంగా ముగిసింది.

ఈ సందర్భంలోనే ఆంధ్రదేశ గ్రంథాలయసంఘ సర్వసభ్య సమావేశంలో నూతన సంవత్సరానికి పాలకసంఘం ఎన్నుకోబడ్డది. రాబోవు మహాసభకై కడపజిల్లావారిచ్చిన ఆహ్వానం అంగీకరింపబడినది.

# స్వాగత పద్యము

శ్రీ గడియారము రామకృష్ణశర్మ
ఆహ్వానసంఘకార్యదర్శి.

సాతవాహనరాజు లీతటంబున నాంధ్ర
సామ్రాజ్య బీజముల్ చల్లినారు
చాళుక్యసామ్రాజ్య చంద్రు లీగడ్డను
తమదానధారల తడిపినారు
చోళసామంతు లీచోటనే ధర్మ స
స్యములకు తగుపోడి సలిపినారు
మత్తారులను జీల్చి మా తుంగభద్రలో
కాకతీయులు కత్తి గడిగినారు
విజయనగరావనీశులీ విపులమీద
పున్నెములపంట పెనురాసి బోసినారు
పూజ్యమగునిట్టి యీ యలంపూరిసీమ
స్వాగతముపల్కె మీకు సుస్వాగతంబు.

# ఆహ్వానసంఘాధ్యక్షోపన్యాసము

## శ్రీ సురవరం రంగారెడ్డిగారు

మహాశయులారా !

నిజముగ ఈప్రాంతమున కంతయు ఈదినము మిక్కిలి సుదినము. మౌర్యులు, శాతవాహనులు, చాళుక్యులు, కాకతీయులు, విజయనగర చక్రవర్తులు పరిపాలించిన ఈఅలంపూరి సీమలోని యొక పల్లెటూరిలో ఆంధ్రదేశ గ్రంథాలయసంఘము తన ౨౩ వ మహాసభను జరుపుకొను చుండుట కొనియాడదగిన విషయము. ఈ సందర్భములో అనేక దూరప్రాంతముల నుండి వ్యయప్రయాసల కోర్చి మాపల్లె కరుదెంచి నేటి యీమహాసభ జయప్రదముగ జరుగుటకు తోడ్పడిన మహాజను లగు మీకందరికిని మా ఆహ్వానసంఘపక్షమున స్వాగతము. యుద్ధ ఫలితముగా ఆహారపదార్థముల సమకూర్చుటలో సరియైన అనుకూల ములు లేని యీదుష్కాలమున మా ఆతిథ్యమునం దేమైన పొర పాటులు కలిగినచో అవి మాయుద్దేశ్యపూర్వకముగా జేయబడినవి కానందున క్షమింపవలసి యుండును.

మద్రాసురాష్ట్రమున ఈ గ్రంథాలయ సంఘము ముప్పదేండ్లకు పైబడి పనిచేయుచున్నది. ఇంచుమించు సరిగా ఆకాలమునందే మన నిజాంరాష్ట్రమునందలి తెలంగాణమునందును గ్రంథాలయోద్యమము ప్రారంభింపబడి సాగుచున్నది. ఒకేభాష, ఒకే సంప్రదాయము, ఒకే సంస్కృతిగల తెలుగువారు రాజకీయకారణముగ ఒకరినొకరు కలిసి కొనలేకుండిరి. మా ప్రభుత్వమువారి భావవైశాల్యముచేత తెలంగా ణమునకును, బ్రిటిషాంధ్రమునకును సంబంధించిన తెలుగువారు కలిసి కొనుటకు మొదటిసారిగ యేడాదిక్రితమే అవకాశము లభించినది. పోయినసారి శ్రీ కోదాటి నారాయణరావుగారును, శ్రీ ఆకుల లక్ష్మీ నారాయణగుప్తగారును ముందంజవైచి ౨౨ వ ఆంధ్రదేశ గ్రంథా లయ మహాసభను సింగరేణికాలరీసున కాహ్వానించి దిగ్విజయముగ దీనిని జరుపుటతో తెలంగాణము ఉత్తరసర్కారునందలి గ్రంథాలయ సేవకులు ఒకరినొకరు కలిసికొని తమస్నేహమును పెంపొందించుకొను



శ్రీ సురవరము రంగారెడ్డిగారు

పుట ౧౨

టకు పిలుపిచ్చినది. దీనితో గ్రంథాలయోద్యమమునకు నూతన వికాసము ప్రసాదితమైనది. ఒకమూలను ప్రారంభమైన వెలుగును తెలంగాణము నలుమూలల వ్యాపింపజేసి చల్లగ దీనిని రాయలసీమ కందించు సంకల్పముతో కర్నూలుజిల్లా సరిహద్దులోని అలంపూరు తాలూకాకు ౨౬ వ మహాసభను ఆహ్వానించుట జరిగినది. ఈ యే డిచ్చట జరుగుచున్న మహాసభ వెనుకటిసభలకంటె ఘనతర కార్యములను సాధించి మన పొలిమేరలోనున్న రాయలసీమలోగూడ నీగ్రంథాల యోద్యమము చక్కగ వ్యాపించుటకు తోడ్పడగలదని నమ్ముచున్నాను.

ఒక్కవిషయము నిక్కడ ప్రస్తావించుట అవసరమనుకొందును. తెలంగాణము వారిపై, రాయలసీమవారిపై ఉత్తర సర్కారులవారు నిరసనభావము గలవారని ఒక వాడుక ప్రసిద్ధమై యున్నది. ఇందు అతిశయోక్తియున్నను కొంతసత్యము లేకపోలేదు. ఆంధ్రవాఙ్మయ మునకును, ఆంధ్ర శిల్పమునకును, ఆంధ్ర పరాక్రమమునకును, ఆంధ్ర సంస్కృతికిని క్రీడారంగమై విలసిల్లిన మా తెలంగాణము విజయనగర పతనానంతరము పలుపాటులకు గురియై వైజ్ఞానికముగ ముందుకరుగు అవకాశము లేనిదై యున్నను ఏవిషయమునను ఇతరులకు తీసిపోదు. రాష్ట్రేతర పండితులను సత్కరించుట రసికత్వముచేతనేగాని అజ్ఞానము చేగాదు. ఈకారణములనుబట్టి ఈ రాష్ట్రము వెనుకబడినదని నిర్ణ యించినచో అది సాహసమనక తప్పదు. రాజకీయాదిరంగములలో పరస్పర విభేదము లుండవచ్చునుగాని పవిత్ర సారస్వతరంగమున తర తమ భేదములకు తావులేదు. అప్పుడప్పుడిట్లే అన్నిప్రాంతముల వారును సమావేశమగుచున్నచో నొకరినొకరు తెలిసికొని అపోహాలను పోగొట్టుకొని యుందువారు. ఈ ఉద్యమమునకు విశేషవ్యాప్తి కలి గించియుండెడివారు. ప్రతిఆంధ్రుడును ఆంధ్రాభ్యుదయముతోపాటు విశ్వకళ్యాణమును సాధించుటలో నాదర్శప్రాయుడగు గాక.

అనేక శతాబ్దులనుండి ఎడతెగక సాహిత్యోపాసకులను సత్క రించుచున్న గద్వాల, వనపర్తి, కొల్లాపురము మొదలగు సంస్థానములు మనపొలిమేరలోనివే. కాకినాడలోని ఆంధ్రసాహిత్య పరిషత్ గ్రంథా

లయమునందున్న అలంకార గ్రంథములలో మిన్నయై నేటి గద్వాల పాలకుల అనాదరణచే సగము ముద్రింపబడిన 'అలంకార శిరోభూషణము' మాకుసమీపమునసున్న బోరవెల్లియందే పుట్టినది. 'ఆంధ్ర అనర్ఘరాఘవము', 'మంథానభైరవతంత్రము' మున్నగు గ్రంథరాజములు మా తాలూకాయందే జన్మించినవి. చోళ సామంత మండలేశ్వరులచే సన్మానింపబడిన సోమేశ్వర రాసి పండిత, వితరణేంద్ర రాసి పండిత, బ్రహ్మరాసి భట్టారక, ధరణీంద్ర రాసిపండిత, భువనశక్తి లోకాభరణ పండితులు మా సీమలో విలసిల్లినవారే. విజయాదిత్యాది బాదామీ చాళుక్యులకును, త్రయిలోక్యమల్ల, భువనైకమల్ల, త్రిభువనమల్ల, పెర్మాడిరాయాది పశ్చిమ చాళుక్యులకును, భుజబలమల్లాది కలచుర్య చక్రవర్తులకును, రుద్రదేవ - ప్రతాపరుద్రాది కాకతీయులకును, కృష్ణదేవరాయాది విజయనగర సార్వభౌములకును విహారభూమియై వారిచే నారాధింపబడిన పుణ్యక్షేత్రమైయున్న యీసీమలో నీ మహాసభ జరుగుచుండుట సంతోషింపదగిన విషయము.

ఇదంతయు యథార్థలేశము మాత్రమే. ఏదిఏమైట్లున్నను ముందంజవేసి మనభవిష్యత్తును మనము నిర్ణయించుకొను సుసమయము ఆసన్నమైనది. ఈసందర్భమున సభాస్తారులగు అనుభవజ్ఞులును, విద్వాంసులును అమూల్యాంశములను బోధించి మనల సరియైన మార్గమున నడిపింగలరని ఆశించుచు మరియొకమారు మీయందరకును హృదయపూర్వక స్వాగతమనుచు విరమించుచున్నాను.

సుప్రసిద్ధులును, సర్వజనులకును ప్రీతిపాత్రులును, బాలబాలికల విద్యాభివృద్ధికై ఎక్కువపాటుపడినవారును, రెడ్డిగ్రంథాలయ నిర్మాతలును, హైదరాబాదులోని ప్రసిద్ధగ్రంథాలయములకు అధ్యక్షులును, ఆంధ్రభీష్ములనదగినవారును ఐన శ్రీమంతు రాజా వెంకట రామారెడ్డి బహద్దర్, ఒ. బి. ఇ. గారిని ఈమహాసభకు అధ్యక్షత వహించి మహాసభా కార్యములను సాగించుటకు ప్రార్థించుచున్నాను.

ఇట్లు,

సురవరం రంగారెడ్డి
ఆహ్వాన సంఘాధ్యక్షుడు



శ్రీ మాడపాటి హనుమంతరావుగారు

## * ప్రారంభోపన్యాసము

### ఆంధ్రపితామహ శ్రీమాడపాటి హనుమంతరావుగారు

సోదరీ సోదరులారా!

ఇరువైఆరు సంవత్సరములనుండి, ఆంధ్ర గ్రంథాలయోద్యమ ప్రసరణమునపై నిస్స్వార్థమగు సేవ యొనర్చుచున్న సోదరాంధ్రులతో గలసి ఈ మహాసభయందు పాల్గొను భాగ్యము నాకు ఈ సంవత్సరము కలిగినందునకు నన్నుధన్యునిగా భావించుచున్నాను. గతసంవత్సరపు మహాసభకు నేను రాజాలకపోయితిని. అందునకెంతయు చింతించి యుంటిని. ఈసారి ఆకొరత తీరినందునకు నాకెంతయో సంతసము కలుగుచున్నది.

ఈసందర్భమున నాచిరమిత్రులును, త్యాగమూర్తులును, నేటి కాలమున గ్రంథాలయోద్యమ వ్యాప్తికొరకును, వయోజన విద్యా ప్రసారము కొరకును జీవితమర్పించి పనిచేయుచున్న శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారితోను, విఖ్యాత మాతృభాషా రాధకులగు శ్రీరామచంద్రశాస్త్రిగారితోను, గలసికొనుట భాగ్యవిశేషము. శ్రీ పాతూరి నాగభూషణముగారివంటి సేవాధురీణులగు యువకులు పలువురు ఎడతెగక ఈకార్యమున నిమగ్నులైయుండుట ఈయుద్యమాభ్యుదయమునకు అమితముగ తోడ్పడుచున్నది. శ్రీకొమ్మా సీతారామయ్యగారివంటి త్యాగశీలురు దేశీయుల ప్రశంసకు ఎంతయు తగినవారు. ఇట్టి మహోదారులగు వారి యెదుట నిలచి అల్పజ్ఞుడను, ఎట్టి త్యాగమును చేయని వాడను నగు నేను మాట్లాడుటకు సిగ్గుపడుచున్నాను.

ఆంధ్రులమగు మనమందరము - బ్రిటిషిండియాలోని వారమైనను సరే, దేశీయ రాజ్యములోని వారమైనను సరే, మన పూర్వులార్జించిన సొత్తునకు - విజ్ఞానమునకు - సమానహక్కుగల వారసులము. ప్రశంసనీయమగు పూర్వచరిత్ర, మనోజ్ఞమగు సాహిత్యము, చారిత్రకమగు కలాసౌందర్యము మున్నగునవి యన్నియు మనకు సమిష్టి

* ఇది సంగ్రహము

ఆస్తి. నేడు మనము రాజకీయములగు పరిపాలనా విషయములందు భిన్నావస్థయం దున్నాము. అయినను, అందరము ఏకోదరులమే. కాలము మారుచున్నది. మనకు మధ్యగల ఎడబాటు, దూరము క్రమముగా తగ్గగలవు. మనవిజ్ఞానము హెచ్చగలదు. అట్టిస్థితి సంపూర్ణముగా నావహించి ఆంధ్రజాతికి చిరకీర్తి కలుగనున్నది.

ఆ పరమావధిని సమీపింప జేయుటలో మన గ్రంథాలయోద్యమము తోడ్పడునట్లు దైవమనుగ్రహించుగాక యని నాప్రార్థన.

ఇట్లు,

మాడపాటి హనుమంతరావు



శ్రీ రాజాబహద్దరు వెంకట్రామారెడ్డిగారు

## * అధ్యక్షోపన్యాసము

శ్రీ రాజాబహద్దరు వేంకటరామారెడ్డి, ఒ. బి. ఇ. గారు

ఆర్యులారా,

విద్యాధికులును, దేశారాధనపరులునునగు అనేకులుండగా నావంటి వయోవృద్ధుని యీ మహాసభకు అధ్యక్షునిగా జేసితిరి. దీనికి నాయందు పిన్నవారగు తమకందరికినిగల గౌరవమే కారణమని భావించుచున్నాను.

ఆంధ్రదేశమున గ్రంథాలయోద్యమమును, వయోజనవిద్యను వ్యాపింపజేయుచున్న మహాశయు లిచ్చట సమావేశమగుట గొప్ప విశేషము. నిజాం రాష్ట్రంలోని ఆంధ్ర ప్రాంతములోకూడ ఆంధ్రగ్రంథాలయములు చాలాకాలమునుండి శక్తికొలది సేవ చేయుచున్నవి. ఇట్టి వానిలో హైదరాబాదునగరమున ౧౯౦౧ వ సంవత్సరమున విఖ్యాతులగు శ్రీ మునగాల సంస్థానాధీశ్వరులవలన స్థాపింపబడిన శ్రీకృష్ణదేవరాయల ఆంధ్రభాషానిలయము మొట్టమొదటిది. నాటినుండి నేటివరకు ఆంధ్రగ్రంథాలయములు తెలంగాణమునందు మూలమూలల వ్యాపించియున్నవి. ఆట్టివానిసంఖ్య రెండునూర్లకు మించియున్నదని తెలిసికొనియున్నాను. అయినను తగిన పోషణములేని కారణమున అన్నియును మంచిస్థితిలో లేవని చెప్పవలసి వచ్చినది.

నేటికాలమున గ్రంథాలయములు ఎచ్చటనైనను సరే అత్యంతావశ్యకములై యున్నవి. సామాన్యముగా విద్యావిషయములందును, విశేషముగా ఆంధ్రభాషావిషయమునను వెనుకబడియున్న మారాజ్యమున ఇట్టి యుద్యమము అమితమగు సేవయొనర్చినది. ఒనర్చుచున్నది. మన మహాసభలు మాప్రాంతములోని ఈసేవకు ఎక్కువ ప్రోత్సాహము కల్పించుచున్నవి. గతవత్సరమున ఈ మహాసభ వరంగల్లుజిల్లాలో జరిగియుండెను. ఈ సంవత్సరమున రాయచూరు జిల్లాలోని అలంపూరు తాలూకాలోనున్న ఈ క్యాతూరులో సమావేశమగుచున్నది. ఇది మన కందరికిని అత్యంత సంతోషదాయకము.

---

* ఇదికూడ సంగ్రహమే.

మా రాజ్యమున నిటీవల విద్యాశాఖవృద్ధి హెచ్చుగా జరుగుచున్నది. ఇప్పుడు మా ప్రభుత్వమునకు విద్యామంత్రిపదవి నలంకరించి యున్న నవాబ్ ఆజంజంగ్ బహాదరుగారు చాల ప్రసిద్ధికలవారు. ఉదారహృదయులు. వారి మంత్రిత్వకాలమున జనసామాన్యమున విద్యావ్యాప్తితోపాటు గ్రంథాలయోద్యమముకూడ వృద్ధిపొందునని మన మాశించవచ్చును.

గ్రంథాలయములకు సర్వసాధారణముగ ద్రవ్యసహాయము చేయుపద్ధతి మా ప్రభుత్వమువారు ఇంకను ఆరంభించలేదు. దేశములోని కొన్ని పుస్తకభాండాగారములకు మాత్రము గ్రాంటుల దయచేయుచున్నారు. మా విద్యాశాఖామంత్రిగారి దృష్టిలో గ్రంథాలయ ఉద్యమమును బలపరచు ఉద్దేశము ఇదివరకే యున్నదని తెలిసినది. మనము వారిశ్రద్ధను ఈవైపునకు ఆకర్షించుచో ఎక్కువలాభము చేకూరగలదని నమ్ముచున్నాను.

మహా ఘనతవహించిన నిజాము ప్రభువరేణ్యులు నిరుపమానమగు విద్యాపోషకులు. వీరిపాలనము దేశీయులకు సర్వశుభములను సమకూర్చుచున్నది. దైవము వారికిని, వారి కుటుంబమునకును, ఆయురారోగ్యైశ్వర్యముల సమకూర్చుగాక! ఆంధ్ర గ్రంథాలయోద్యమము త్యాగమూర్తులగు కార్యకర్తల సేవామాహాత్మ్యమున దినదినాభివృద్ధి నొందుగాక!

ఇట్లు,

రాజాబహాదరు వెంకటరామారెడ్డి

# క్యాతూరు మహాసభా విశేషాలు

గత సంవత్సరం 25 వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ ఇల్లెందు (సింగరేణి కాలరీస్) లో జరిగిన తర్వాత గ్రంథాలయోద్యమాని కొక నూతనశోభవచ్చింది. నిజాంరాష్ట్రాంధ్రుల ప్రజాజీవితంలో ఒక పరివర్తన, నూతన చైతన్యము కలిగింది. అఖిలాంధ్ర దేశానికి చెందిన సోదరులంతా, గ్రంథాలయోద్యమ వేదికపై మొదటిసారిగా కలవటం తటస్థించినది. అప్పటినుండీ వివిధ ప్రదేశాల ఆంధ్రులలో పరస్పర పరిచయమూ, సోదరభావమూ పెంపొందుతూ వచ్చింది. ఈసంవత్సరం క్యాతూరులో జరిగిన 26 వ గ్రంథాలయ మహాసభలో ఆసంబంధాలు దృఢతరమైనవి.

గ్రంథాలయ మహాసభకు మొదటిసారిగా ప్రత్యేకప్రాంగణం నిర్మించబడింది. ఆయిదువేలమంది కూర్చొనగల విశాలమంటపం, ప్రతినిధులకు బసలు, భోజనశాలలు నిర్మించబడ్డవి. ప్రత్యేకనగరం నిర్మించే ఆచారం గ్రంథాలయమహాసభకు యిదే మొదటిసారి. ద్వారాలు అలంకారపూరితముగా నిర్మించబడినవి. ప్రధానద్వారం మీదట తెలుగు గ్రామీణజీవనం చక్కగా చిత్రించబడినది. ఒక స్తంభానికి 'జైహింద'ని, మరొక స్తంభానికి 'వందేమాతర' మని పేరు పెట్టబడినది. స్వచ్ఛంద సేవకులకు ప్రత్యేకమయిన దుస్తులు మొదలగునవి ఏర్పరుపబడి చక్కని శిక్షణ యివ్వబడింది. ఈవిషయంలో వెంకటరెడ్డిగారిని గద్వాల కార్యకర్తలు శ్రీకృష్ణసింహగారిని ఎంతయిన అభినందించవలసి యున్నది. శ్రీసురవరం ప్రతాపరెడ్డిగారు మహాసభకు మూడువారముల ముందునుంచీ క్యాతూరులో స్వయంగా కార్యాలయంలో వుండి పనులన్నీ నిర్వహించారు. ప్రతాపరెడ్డిగారు యింతటి పూనికతో ఒక పనిని నిర్వహించటం మొట్టమొదటిసారిగా ఈసారే చూచాను. ఇది గ్రంథాలయోద్యమం సాధించిన ఒక అమోఘమైన విజయమని చెప్పవచ్చును. శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులుగారు ప్రారంభోత్సవం చేయుట మరొకవిజయం. ఎంతో కాలంనుంచి గ్రంథాలయమహాసభకు శ్రీ హనుమంతరావు పంతులుగారిని అధ్యక్షులుగాను, ప్రారంభోపన్యాసకులుగాను వుండమంటే వారు సుతరామూ ఒప్పుకోలేదు. ఈ సంవత్సరం ఆడబోతే తీర్థం ఎదురైనట్లు వారు ప్రారంభకులుగా వుండటం తటస్థించింది.

ఈ మహాసభకు యెక్కువమంది ప్రతినిధులురారనీ, ప్రేక్షకులుకూడా చాలా తక్కువమంది వస్తారనీ నేననుకొన్నాను. కాని అట్లాకాలేదు. ౭౫ మందికిపైగా ప్రతినిధులు వచ్చారు. మూడువేలమందికి పైగా ప్రేక్షకులు వచ్చారు. అలంపూరు, గద్వాల, కొల్లాపురం, వనపర్తి, పాపన్నపేట మొదలగు ప్రాంతాలనుంచి అనేకమంది యువక కార్యకర్తలు వచ్చి భక్తిశ్రద్ధలతో పాల్గొన్నారు. ఈప్రాంతంలో వచ్చే సంవత్సరం చక్కగా గ్రంథాలయోద్యమం నిర్వహింపబడుతుందని ఆశ వున్నది. అనేక ప్రాంతాల గ్రంథాలయాలు అప్పుడే బూజు దులుపబడ్డవి. మొత్తంమీద ఈప్రాంతంలో యిదివరకెన్నడూ కలుగని చైతన్యం కలిగింది.

సభకువచ్చిన ప్రేక్షకులలో విశేషంగా స్త్రీలు. చుట్టుపక్కల గ్రామాల్లో నుంచి కూడ వచ్చిపాల్గొనడం చాల సంతోషం. చాల వెనుకబడ్డ ప్రాంతంలో పురుషులకంటె స్త్రీలే యెక్కువశ్రద్ధ చూపారు. ప్రతిసమావేశం చివరివరకు వారుండటమే కాకుండా విరాళాలు యివ్వగలిగినంత యెక్కువగా తీసుకొనివచ్చి స్వయంగా వేదికవద్దకు తెచ్చియిచ్చారు. ఇంతశ్రద్ధ పల్లెటూరిస్త్రీలు కనపరచటంమూలంగా భవిష్యత్తు ఎంతో ఆశాజనకంగా కనుపించింది.

ఈ సంవత్సరం రాయలసీమసోదరులుకూడా ఎక్కువసంఖ్యలో పాల్గొనడం చెప్పుకోతగ్గ విశేషం. బళ్లారినుంచి బరంపురంవరకు అన్నిప్రాంతాల ఆంధ్రులు సమావేశమయ్యారు. సభాకార్యక్రమంలో మనరాష్ట్ర సమస్యలకే యెక్కువ ప్రాధాన్యత యివ్వబడింది. చాలా ముఖ్యమయిన సమస్యలుచర్చింపబడి తీర్మానింపబడవి. నిజాంరాష్ట్రంలోని సార్వజనిక గ్రంథాలయాలకు ప్రభుత్వసహాయం లభింపచేసేందుకొక రాయబారవర్గం నిర్మింపబడింది. అందులో శ్రీ రాజాబహద్దరు వెంకట్రామారెడ్డి, మాడపాటి హనుమంతరావు, నాగులపల్లి కోదండరామారావుగారలు ఎన్నుకోబడ్డారు. వారికృషివల్ల యీసంవత్సరం గ్రంథాలయోద్యమానికి యెక్కువ సహాయం లభించగలదని నమ్ముచున్నాను.

ఈమహాసభకు మరొక విశేషం ఏమంటే శ్రీరాజాబహద్దరు గ్రంథాలయోద్యమంలో తమకుగల అభిమానచిహ్నంగా యెవరూ అడుగకుండానే ఆంధ్రదేశ గ్రంథాలయసంఘానికి రు 100—0—0 లు విరాళమిచ్చినారు. వీరిననుసరిస్తూ ఆహ్వానసంఘాధ్యక్షులు శ్రీ సురవరం రంగారెడ్డిగారు రు 50—0—0 లు, సభలోనున్న కొందరు ప్రతినిధులు ప్రేక్షకులు కాడివారి ఉత్సాహాన్నిబట్టి చెల్లించిన మొత్తాలన్నీ చేరి రు 250—0—0 లు వరకు వసూలైనవి.

సభలో చెప్పుకోతగ్గపని యింకొకటి జరిగింది. కొత్తూరులో ఒక బాలికా పాఠశాలను, స్త్రీలకొక గ్రంథాలయాన్ని నెలకొల్పటానికి స్థానికప్రముఖులును, ఆహ్వానసంఘాధ్యక్ష కార్యదర్శులును నగు శ్రీ సురవరం రంగారెడ్డి, మోరం నరసింగారెడ్డిగార్లు వాగ్దానం చేశారు. ఇది త్వరలో కార్యరూపం తాలుస్తుందని ఆశిస్తున్నాను.

ఈ సభలో శాఖాసమావేశాలుకూడ చక్కగా నిర్వహింపబడినవి. సమర్థులైన అధ్యక్షులు ఎన్నుకోబడ్డారు. ఉపన్యాసాలుకూడ అనుభవపూరితమైనవి వచ్చినవి. ఇతర ఉపన్యాసాలున్నూ విజ్ఞానవంతంగానూ, ప్రయోజనకరంగానూ వున్నవి. అనవసరమైన చర్చ ఒక్కటికూడ జరగలేదు.

ఈ మహాసభ సమావేశాలతోపాటు సారస్వత పరిషత్తు సమావేశాలుకూడ జరిగినవి. ప్రసిద్ధులైన పండితులు, కవులు వచ్చారు. వీరిలో పేర్కొనతగ్గవారు శ్రీ అనుమాల వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రి, గడియారం శేషశాస్త్రిగారలు. వీరు కేవలం పండితులేకాక గొప్ప అభ్యుదయవాదులు. వారినిచూచి నేను ఆశ్చర్యచకితుడ

నయ్యారు. శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ఆ ప్రాంతానికి ఒక గురుపీఠమని చెప్ప వచ్చును.

ఈ సభకు విరాళాలు బాగా వసూలుచేశారు. ఏసభకుకూడ యింతగా ధనం వసూలుకాలేదు. దాదాపు నాలుగువేల రూపాయిలు వసూలైనట్లు తెలుస్తున్నది. ఖర్చుకూడ బాగానే అయింది. ఆహ్వానసంఘం వారు సంచికాముద్రణకు అయ్యే వ్యయాన్ని కూడ తామే భరిస్తామన్నారు. 27 వ మహాసభకూడ తెలంగాణంలోనే జరుగవలెనని మేము చాలా అభిలషించాము. కాని రాయలసీమ వారు తమ ప్రాంతంలో చేయాలని చాల కుతూహలపడ్డందువల్ల మా కోరిక వదులుకోవలసి వచ్చింది.

25 వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ ప్రారంభించిన నూతన శకాన్ని 26 వ మహాసభ అన్నివిధాల దిగ్విజయ మొనర్చిందని చెప్పవచ్చును. ఈ అవకాశాన్ని కలిగించిన శ్రీ గడియారం రామకృష్ణశర్మ, సురవరం ప్రతాపరెడ్డి, సురవరం రంగారెడ్డి, మారం నరసింహారెడ్డి గారలకు తదితర ఆహ్వానసంఘ సభ్యులకు తెలంగాణపు గ్రంథాలయ సేవకుల ధన్యవాదాలు. కర్నూలు ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమ చరిత్రలో విశిష్టస్థానం ఆక్రమించగలదని నమ్ముచున్నాను.

తెలంగాణములోని ఒక గ్రంథాలయ సేవకుడు

# ఆంధ్ర దేశ గ్రంథాలయ సంఘము

## తెలంగాణా కార్యాలయపు సంగ్రహనివేదిక

ఆంధ్రదేశగ్రంథాలయసంఘ నిర్ణయము ప్రకారం తెలంగాణా కార్యాలయపు ప్రారంభోత్సవం లాంఛనపూర్వకంగా ఖమ్మంమెట్టులో ౧౯౪౯ ఏప్రియల్ ౧౩ వ తేదీన సంఘాధ్యక్షులగు శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారిచే జరుపబడినది. కాని యిచ్చటిపని ౨౯ వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభతోనే ప్రారంభమైనది.

### రాష్ట్రంలోని గ్రంథాలయాలు

గ్రంథాలయోద్యమ కార్యక్రమం ప్రారంభించటానికి పూర్వం రాష్ట్రంలోని గ్రంథాలయాల సమగ్ర వృత్తాంతము తెలుసుకొనవలసి యున్నది. అందుకని గ్రంథాలయమహాసభకు ముందే అనేకవ్యక్తులకూ గ్రంథాలయాలకూ వ్రాసినాము. సరియైన శ్రద్ధ గ్రంథాలయాలవారు కాని, ఆ యా వ్యక్తులుకాని కనపరచక పోవటం మూలంగా చాలా శ్రమపడవలసి వచ్చినది. తెనుగు, నీలగిరి, గోలకొండ, ఆంధ్రాభ్యుదయ మున్నగు పత్రికల సంపుటాలన్నీ తిరగవేసి శ్రీమాడపాటి హనుమంతరావుపంతులుగారి వద్దనున్న పట్టికనుండి, శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయ రజతోత్సవ సంచికనుండి వివిధగ్రంథాలయాల సమాచారాలను సేకరించనైనది. మాకుగల గ్రంథాలయ సేవానుభవంతో పరిచయమేర్పడిన వివిధగ్రంథాలయాల సమాచారాలను జోడించి ఒక పట్టికను సిద్ధపరచనైనది. రాష్ట్రంలో ౨౬౯ గ్రంథాలయాలలో ౧౫౦ అయినా సరిగా పనిచేస్తున్నవని మా అంచనా. కొన్ని క్రొత్త గ్రంథాలయాలు తమ వివరాలను యెన్నిసార్లు వ్రాసినా, పత్రికాప్రకటనలు చేసినా వంపేపాటి శ్రద్ధ వహించకపోవడంవల్ల వాటిసమాచారము ఈ పట్టికలో చేర్చబడియుండక పోవచ్చు.

౨౯ వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభా సందర్భమునమూ, తర్వాతనూ మొట్టమొదటిసారిగా ఆంధ్రదేశ గ్రంథాలయసంఘంలో సభ్యులను చేర్పించటం ప్రారంభించినాము. శ్రీ హరిసర్వోత్తమరావుగారి

షష్టిపూర్తిచిహ్నంగా ౬౦౦ సభ్యులను చేర్పించవలెననే గ్రంథాలయ సంఘ సంకల్పం ప్రకారం తెలంగాణా వంతుకు ౧౦౦ గురు సభ్యులను చేర్పించవలెనని ఆదేశింపబడింది. తారణ సంవత్సరమున చేర్పించిన సభ్యులసంఖ్య ౧౦౫. అందులో గ్రంథాలయాలు ౩౭. ఈ సంవత్సరం యింతవరకు చేర్పించిన సభ్యులసంఖ్య ౧౭౮. గ్రంథాలయాలు ౪౩.

ఈ సంవత్సరం గ్రంథాలయాలు సభ్యత్వం వహించటంలో గ్రామ గ్రంథాలయాలు కొంత శ్రద్ధ కనపరచినవి. కొన్ని గ్రంథాలయాలవారు దూరంనుంచి సభ్యత్వరుసుం మనియార్డరుద్వారా పంపించారు. కాని పట్టణ గ్రంథాలయాలవారు చూపించిన అశ్రద్ధా, నిర్లక్ష్యమూ శోచనీయం. హైదరాబాదు, సికిందరాబాదు గ్రంథాలయాలు యీ విషయంలో మొదట చెప్పుకోతగ్గవి. శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషానిలయం, వేమనాంధ్రభాషానిలయంవంటి ప్రఖ్యాతసంస్థలు ఎన్నిసార్లు వ్రాసినా, పత్రికాప్రకటనలు చేసినా, చివరకు స్వయంగా వెళ్లి అడిగినా సభ్యులుగా చేరేపాటి శ్రద్ధవహించలేదు. దీనినిబట్టి చూస్తే సంఘము మొదల వారికి గల నిర్లక్ష్యభావము తేటపడుతుంది.

### గ్రంథాలయ శిక్షణ

రేపేంద్రపాడులో ఆంధ్రదేశ గ్రంథాలయసంఘము నిర్వహించిన గ్రంథాలయశిక్షణ తరగతులకు తెలంగాణా ప్రాంతంనుండి నలుగురి అభ్యర్థులను పంపించడమైనది. ఈఅభ్యర్థులందరూ గ్రంథాలయ ప్రవేశిక పరీక్షలో ఉత్తీర్ణులైనారు. వారు అందరూ తిరిగివచ్చి సేవానిర్వహణకు పూనుకొన్నారు. ఈ సంవత్సరం గ్రంథాలయ శిక్షణతరగతులు మన ప్రాంతములోనే నెలకొల్పబడి కనీసం ౩౦ మంది గ్రంథాలయ సేవకులకు శిక్షణ ఈయవలెనని సంకల్పం.

### ఆంధ్ర పితామహుని సన్మానము

నిజాంరాష్ట్రాంధ్రోద్యమానికీ, గ్రంథాలయోద్యమానికీ మూల పురుషులైన ఆంధ్ర పితామహ శ్రీ మాడపాటి హనుమంతరావుగారి షష్టిపూర్త్యుత్సవము ఈ ఫిబ్రవరి ౬, ౭ తేదీలలో హైదరాబాదులో

జరిగినప్పుడు మనసంఘపక్షమున వారికి సన్మానపత్రము సమర్పింప బడినది. సంఘోపాధ్యక్షులు శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు మన సంఘ పక్షమున శాలువనూ సన్మానపత్రమునూ, సమర్పించి వారియందు మనకుగల భక్తిభావముల వెల్లడించారు.

### ప్రచారము

గ్రంథాలయోద్యమ ప్రచారంనిమిత్తము ఒకప్రత్యేక ప్రచారకుని నియమించ సంకల్పమున్నప్పటికీ ధనాభావముచేత యీపని చేయలేక పోయాము. మన రాష్ట్రంలో జిల్లాకొక ప్రచారకుడైనా నియమింప బడితేతప్ప ఉద్యమమంత త్వరగా సాగదు. వచ్చేసంవత్సరం కనీసం ఇద్దరు ప్రచారకులనైనా పెట్టేపాటి ఆర్థికావకాశం కల్పించవలసి వుంటుందని ఉద్యమాభిమానులకు ప్రార్థన.

### కార్యాలయము

తెలంగాణా కార్యాలయము నెలకొల్పబడిన తరువాత కార్యాలయ కార్యదర్శిగా శ్రీ కొమర్రాజు సత్యనారాయణరావుగారిని నియమించడమైనది. నానాటికి కార్యాలయపని హెచ్చిపోతూవున్నది. ఈ పనికి ప్రత్యేక మొకరిని నియమించవలసి యున్నది. ద్రవ్యం లేకపోవడంవల్ల సక్రమ పద్ధతితో కార్యాలయాన్ని నిర్వహించలేక పోతున్నాము. కార్యాలయ నిర్వహణకు కనీసం నెలకు రూ ౩౦ లైనా అవసరం. ఈవిషయంలోకూడా శ్రద్ధ వహించవలసిందని ఉద్యమాభిమానులకు విజ్ఞప్తి.

### నిధి వసూళ్లు

ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము సంకల్పించిన ముట్నూరి కృష్ణరాయ స్మారకనిధికి రు ౧౩ లు వసూలు చేయబడినవి. మరికొన్ని రూపాయలు వసూలు చేయవలసియున్నది.

తుపానునిధికి రూ ౧౧ లః వసూలు చేయబడినవి.

## ౨౪ వ మహాసభ సంచిక

౨౧ వ ఆంధ్రదేశ గ్రంథాలయమహాసభ సంచికను ప్రచురించుటకు వ్యాసాలన్నీ పరిశీలించబడి సాఫుప్రతులు వ్రాయబడ్డవి. కాని తపు కరవువల్లనూ, ముద్రణసౌకర్యాలు లభించనందువల్లనూ సంచికను ముద్రించలేకపోయినాము. ముందుసంవత్సరంలో ౨౧, ౨౨ మహాసభల సంచికలను కలిపికాని, విడివిడిగాకాని ఒకేసారి ప్రచురించగలమని ఆశిస్తున్నాము.

## సంఘాధ్యక్షుల షష్టిపూర్తి.

సంఘాధ్యక్షులైన శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారి షష్టిపూర్త్యుత్సవాలు ఆంధ్రదేశమంతటా కనీసం ౬౦ కేంద్రాలలో జరపవలెనని ఆంధ్రదేశగ్రంథాలయసంఘము నిర్ణయించినది. ఇందు మొదటి ఉత్సవం సంఘకేంద్రస్థానమైన పటమటలంకలో చాల వైభవంగా జరిగినది. ఇందు మూడువేలరూపాయలకు పైగా వారికి కానుకలు సమర్పింపబడినవి. రు. ౨౦౦౧ ల మొత్తమును సంఘకోశాధిపతులైన శ్రీ కొమ్మా సీతారామయ్యగారు యిచ్చిరి. వారి మిత్రులు స్వంత వినియోగం నిమిత్తము బహూకరించిన మొత్తములుకాక తక్కినవానిలో అధిక భాగమును గ్రంథాలయోద్యమ వినియోగముకొరకైన భవనాదులనిమిత్తమును, కొంతభాగమును రాయలసీమ ప్రచారంకొరకును వెచ్చించగలమని శ్రీ హరిసర్వోత్తమరావుగారు తమ నిర్ణయమును తెలిపిరి. తమజీవితాన్నంతా స్వార్థరహితంగా దేశంనిమిత్తము, ముఖ్యంగా విజ్ఞానవ్యాప్తికోసం వినియోగించిన ఈ మహాపురుషుని గౌరవించుటలోకూడా తెలంగాణా ఉచితపాత్రను నిర్వహించవలసి యున్నది. ఏవిషయంలోనూ వెనుకంజవేయని మనప్రాంతము ఈ విషయములో ముందడుగు వేస్తుందని ఆశిస్తున్నాము.

# ఆదాయ వ్యయములు

## ఆదాయము

| రు. అ. పై. | |
|---|---|
| 121-0-0 | ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘం కేంద్రకార్యాలయంవారు సంచికనిమిత్తంయిచ్చినవి బి.జీ. |
| 105-0-0 | కారణసం॥ సభ్యత్వం. ,, |
| 173-0-0 | పోషక సం॥ సభ్యత్వం ,, |
| 1-0-0 | సహాయ సం॥ సభ్యత్వం. ,, |
| 66-10-8 | వెచ్చం. (హాలీలమారకం) |
| 30-0-0 | విరాళాలు |
| 16-0-0 | కృష్ణరాయ స్మారకనిధి |
| 11-0-0 | తుకాను నిధి |
| 19-12-0 | అమ్మకం (స్టేషనరీ) |
| 543-6-8 | వెరసి (హాలీలు) |

## వ్యయము

| | రు. అ. పై. |
|---|---|
| జీతాలు | 120-0-0 |
| అమ్మకానికి స్టేషనరీ ఫొటోలు, వగైరా | 53-12-4 |
| సాదరు | 0-13-0 |
| పోస్టల్ | 20-5-0 |
| ప్రయాణాలు | 27-8-6 |
| పుస్తకాలు | 21-9-4 |
| సామాను | 9-2-0 |
| అచ్చు | 16-8-0 |
| సంచిక వ్యాసాల వ్రాత ఖర్చులు వగైరా | 51-8-0 |
| స్టేషనరీ | 9-10-6 |
| అంత్యనిల్వ | 212-10-0 |
| వెరసి (హాలీలు) | 543-6-8 |

తెలంగాణా కార్యాలయము
ఖమ్మంమెట్టు
౧-3-౧౯౪౬

శ్రీ కోదాటి నారాయణ రావు
ఆం. దే. గ్రం. సంఘ. సహాయకార్యదర్శి

# తీర్మానములు

౧. ఆంధ్ర గ్రంథాలయ మహోద్యమంలో భాగస్వాములుగానుండి సేవచేసి ఇటీవల దివంగతులైన శ్రీ. శే. మోతే గంగరాజు, ముట్నూరి కృష్ణారావు, కొప్పరపు సుబ్బయ్యశ్రేష్ఠి, పాటి వెంకటసుబ్బయ్య, లాభిశెట్టి లింగన్నగుప్త, చాట్రాతి వెంకట లక్ష్మీనరసమాంబ, ముసర్ల శ్రీరామనరసింహం, మంగిపూడి పురుషోత్తమశర్మగార్ల మరణములకు ఈ మహాసభవారు చింతిస్తూ వారి కుటుంబములకు సానుభూతిని తెలియజేస్తున్నారు.

౨. హైదరాబాదు రాష్ట్రాంధ్రుల సర్వతోముఖాభివృద్ధికి ప్రధానకారకులును, గ్రంథాలయోద్యమమునకు మూలపురుషులును నైన శ్రీ మాడపాటి హనుమంతరావు గారి షష్టిపూర్తి సందర్భమున వారి సేవను ప్రశంసిస్తూ వారికి ఆయురారోగ్యములు ప్రసాదించి ఇంకనూ వారి సేవను ఆంధ్రప్రజానీకము పొందునట్లు అనుగ్రహించవలసినదిగ ఈ మహాసభవారు పరమేశ్వరుని ప్రార్థించుచున్నారు.

3. బహిరంగసభల విషయములో హైదరాబాదు ప్రభుత్వమువారు చేసిన మార్పులవల్ల ప్రజావాక్స్వాతంత్ర్యానికి యేమాత్రం అధిక ప్రయోజనం కలగలేదు. ముఖ్యంగా గ్రంథాలయాలకు సంబంధించిన సభల విషయంలో ఈస్థితి ఇదివరకంటె అధ్వాన్నమైనది. బహిరంగసభలపై ఇప్పుడున్న నిర్బంధాలను పూర్తిగా తొలగించాలనీ, ముఖ్యంగా గ్రంథాలయము మున్నగు విజ్ఞానవిషయక సభలకు ఏలాటి నిర్బంధాలుండకూడదనీ, రాష్ట్రేతరులు కూడా సంస్థానములో స్వేచ్ఛగా విజ్ఞాన ప్రచారం సాగించడానికి ఆటంకాలుండకూడదనీ ఈ సభవారు ప్రభుత్వమువారిని కోరుచున్నారు.

౪. (అ) హైదరాబాదు సంస్థానములోని సార్వజనిక గ్రంథాలయాలకు ప్రభుత్వ సహాయము అత్యల్పముగ నున్నది. ఈ పరిస్థితిని తొలగించి ప్రజాసామాన్యం యొక్క విద్యాభివృద్ధికి కృషిచేయడంలో భారతదేశములో ప్రధానమైన ఈ సంస్థానము బరోడా సంస్థానమును అనుకరిస్తుందని ఆశిస్తూ సార్వజనిక గ్రంథాలయాలకు విద్యాశాఖనుండి విరివిగా సహాయము చేయుటకు ఏర్పాటు చేయవలసినదిగా సంస్థాన ప్రభుత్వము వారిని ఈ సభవారు కోరుచున్నారు.

(ఆ) ఈ మహాసభకు హైదరాబాదు విద్యాశాఖా మంత్రిగారు అధ్యక్షులవారి ద్వారా పంపిన సానుభూతి సందేశము పైవిషయములో ఆశాజనకంగా ఉన్నందుకు వారి నభినందిస్తూ, వారికి యింకా యీవిషయములో వివరముగ నచ్చజెప్పి కార్యసాధనకు పూనుకోవలసినదిగా ఈ క్రింది ముప్పురు పెద్దలను ఈ మహాసభవారు కోరుచున్నారు.

(1) రాజాబహద్దరు వేంకటరామారెడ్డి గారు ఓ. బి. ఇ.
(2) మాడపాటి హనుమంతరావు గారు

(౩) నాగులపల్లి కోదండరామారావు గారు

౫. హైదరాబాదు సంస్థానంలో గ్రంథాలయాలపై పరిశీలనాధికారం విద్యా విషయాలతో ఏవిధంగానూ సంబంధములేని పోలీసుశాఖ కున్నందువల్ల గ్రంథాలయాల నిర్వహణలో చాల ఇబ్బందులు కలుగుచున్నవి. ప్రజలలో గ్రంథాలయ ప్రాపవప్తు ఒక విధంగా భయంకూడ కలుగుతున్నది. దీనికి సరియైన సంబంధం విద్యాశాఖదేకాని పోలీసుశాఖతో సంబంధం రద్దుచేయవలసినదని ఈ మహాసభవారు ప్రభుత్వమును కోరుచున్నారు.

౬. హైదరాబాదు సంస్థానములో ప్రజాసంఘాల రిజిస్ట్రేషను చట్టప్రకారం నిర్ణయించియున్న 50 రూపాయల రుసుమును గ్రంథాలయాల విషయంలో 5 రూపాయలకు తగ్గించవలసినదిగా ఈ మహాసభవారు హైదరాబాదు ప్రభుత్వము వారిని కోరుతున్నారు.

౭. మద్రాసునుంచి వెలువడుతున్న "బాల" అనే పిల్లల మాసపత్రికను ఈ మహాసభవారు స్వాగతమిస్తూ ఆంధ్రదేశములోని ప్రతి గ్రంథాలయమున్నూ ఈ పత్రికను విధిగా తెప్పించవలసినదని గ్రంథాలయ నిర్వాహకులను కోరుతున్నారు.

౮. తెలుగుశబ్దములకు ఉత్పత్తి, వ్యుత్పత్తులతో కూడిన బృహన్నిఘంటువును తయారు చేయుచున్న బ్రహ్మశ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రిగారి కృషి నీసభవారు అభినందిస్తున్నారు. దీని ప్రచురణకై పూర్తిగ సహాయపడవలెనని ఈసభవారు ఆంధ్ర ప్రజానీకాన్ని హెచ్చరిస్తున్నారు.

౯. ఉస్మానియా యూనివర్సిటీలో గ్రంథాలయ శిక్షణతరగతుల నేర్పాటు చేయవలసినదిగ యూనివర్సిటీ యధికారుల నీ సభవారు కోరుచున్నారు.

౧౦. గ్రంథాలయోద్యమ పురోభివృద్ధికిగాను ఇదివరకిచ్చిన రు 1,000/- విరాళముగాక యిటీవల మరల రు 2,001/- రొక్కమును రు 9,000/- విలువ చేయు 3 ఎకరముల తోటభూమిని దానమిచ్చి ఆంధ్రగ్రంథాలయ ట్రస్టు నేర్పాటు చేసిన ఆంధ్రదేశగ్రంథాలయ సంఘ కోశాధిపతులు శ్రీ కొమ్మ సీతారామయ్యగారి ఔదార్యము నీమహాసభవారు అభినందిస్తున్నారు. వీరి మార్గమును విద్యాభిమానులనుకరించవలెనని హెచ్చరిస్తున్నారు.

౧౧. హైదరాబాదు సంస్థానములో విద్యాబోధన మాతృభాషలైన తెలుగు, మహారాష్ట్ర, కన్నడములలో జరుపకపోవడం న్యాయంకాదని ఈ సభవారు తలుస్తున్నారు. అంతర్విశ్వ కళాపరిషత్తునమితివారి తీర్మానం ప్రకారం వెంటనే ఇకనైనా హైదరాబాదు ప్రభుత్వమువారును, ఉస్మానియా యూనివర్సిటీవారును ప్రజల మాతృభాషలలో విద్యాబోధనకు ఏర్పాటు చేయవలయునని ఈ సభవారు కోరుచున్నారు.

౧౨. హైదరాబాదు స్టేటులైబ్రరీలో హైదరాబాదు రాష్ట్రంలోని దేశభాషలకు, ముఖ్యంగా తెలుగుకు చూపిస్తున్న అనాదరణమును ఈసభవారు గర్హి

న్నారు. స్టేటు లైబ్రరీలో తెలుగు, మహారాష్ట్ర, కన్నడ వాఙ్మయాన్ని అధికంగా చేర్చవలసిందనీ, వరంగల్లు, ఔరంగాబాదు, గుల్బర్గా పట్టణాలలో తెలుగు, మహారాష్ట్ర కన్నడ భాషలకు ప్రత్యేక గ్రంథాలయాలను ప్రభుత్వమువారు నెలకొల్పవలెననీ ఈ సభవారు సూచిస్తున్నారు.

౧౩. హైదరాబాదు బ్రాడ్‌కాస్టింగు స్టేషనులో గ్రంథాలయోద్యమ ఉపన్యాసాలకు బొత్తుగా స్థానం యివ్వకపోవటానికి విచారిస్తూ తెలుగులో గ్రంథాలయోద్యమము, వయోజనవిద్యలకు సంబంధించిన ఉపన్యాసాలను విరివిగా ఏర్పాటు చేయవలసినదని ఆవిషయములలో ప్రవీణులైన శాస్త్రీతరులనుకూడా రప్పించి వారిచేత ఉపన్యాసములిప్పించ వలెనని హైదరాబాదు బ్రాడ్‌కాస్టింగు డిపార్టుమెంటువారిని ఈసభవారు కోరుచున్నారు.

౧౪. ఆంధ్ర దేశ గ్రంథాలయ సంఘమువారు సంకల్పించిన సంఘాధ్యక్షులు శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు గారి షష్టిపూర్త్యుత్సవములను దేశమంతటా జరుప వలయునని, వారి సేవకు కృతజ్ఞతా సూచకంగా విరివిగా వారికి కానుకల సమర్పించ వలసినదనియూ, విశాలాంధ్రమునందలి ప్రజానీకాన్ని ఈమహాసభవారు కోరు చున్నారు.

౧౫. ఉస్మానియా యూనివర్శిటీద్వారా హైదరాబాదు రాష్ట్రప్రభుత్వము వారు గ్రంథసామగ్రిని అనువదించి ప్రకటించు కార్యక్రమంలో ఉర్దూభాషకు యిస్తూవుండే స్థానమునకు సమమైన స్థానము దేశభాషలకు, అందుముఖ్యంగా తెలుగు భాషకు యివ్వవలసిందని ఈ మహాసభవారు ప్రభుత్వంవారిని కోరుతున్నారు.

౧౬. అన్ని గ్రంథాలయములలోను అక్షరాస్యతా ప్రచారము ప్రధానాంగంగా సాగించవలసినదనీ, ఈసందర్భంగా అక్కడక్కడ జరిగే కార్యక్రమాన్ని ఎప్పటికప్పుడు ఆంధ్ర దేశ గ్రంథాలయ సంఘకార్యాలయానికి తెలుపుచుండవలెననీ ఆంధ్రగ్రంథాలయాలను ఈ సభవారు హెచ్చరిస్తున్నారు.

౧౭. ౨౭ వ ఆంధ్ర దేశ గ్రంథాలయ మహాసభను కడపజిల్లాకు ఆహ్వానించిన శ్రీ కోవూరు వీరభద్రరావు గారి ఆహ్వానాన్ని ఈసభవారు అంగీకరిస్తున్నారు.

పుస్తకంబులు గలిగిన పూరిగుడిసె
యందు నిరుపేద కాపునై యుందుగాని
పుస్తకంబులులేనట్టి భూరిసౌధ
మందు చక్రివర్తిగ నుండ నభిలషింప.

గ్రంథనిలయంబుగల నరకంబునందు
నైన నివసింపఁ గాంక్షింతుఁ గాని నేను
గ్రంథనిలయంబులేని స్వర్గంబునందు
నిమిషమైనను నివసింప నిచ్ఛగింప.

## ప్రచారశాఖా సమావేశము

అధ్యక్షులు

శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు

కార్యదర్శి

శ్రీ బసవరాజు జగన్నాధరావుగారు

# గ్రంథాలయోద్యమప్రచారము - కొన్ని సూచనలు

శ్రీ కోదాటి నారాయణరావు
ఆం. దే. గ్రం. సంఘ సహాయకార్యదర్శి

యథార్థపరిస్థితులను దృష్టిలో వుంచుకోకుండా చేసే ఏసూచనా ఆచరణయోగ్యం కాదు. ఈసూత్రాన్ని దృష్టిలో పెట్టుకొని ఆంధ్రదేశ గ్రంథాలయసంఘము నేడు చేయగలిగిన, చేయవలసిన గ్రంథాలయోద్యమ ప్రచారాన్ని గురించి మనము యోచించవలసి యున్నది. యుద్ధానంతర పునర్నిర్మాణ ప్రణాళికమోస్తరు మనయోచన యువ్విళ్లూరించేది కాకపోవచ్చు. కాని యథార్థదృష్టితో నిర్ణయించుకొనే మన నిర్ణయాలు శక్తివంచనలేకుండా కృషిచేస్తే చాలావరకు నెరవేరగలవు.

గ్రంథాలయోద్యమప్రచారం ఇతోధికంగా జరగవలెనంటే సంఘం నిర్మాణయుతంగా బలపడవలసి వుంటుంది. నిర్మాణయుతంగా సంఘం బలపడితేనే ఉద్యమంలో పనిచేయుటానికి కార్యకర్తకు నూతన ఉత్తేజం, ఉత్సాహం కలుగుతుంది. లేక కేవలం కాగితాలమీదనే సంఘంవుంటే ఉద్యమసేవకులు వాస్తవిక కృషికంటే అతిశయోక్తిగా ప్రకటించుకోటానికి ప్రాధాన్యత యిస్తారు. అందువల్ల సంఘం పేరు పెద్దదైనా, వూరు దిబ్బ అనేమాదిరి అవుతుంది. పైగా అపహాస్యానికి కూడా పాలవుతుంది.

ఆంధ్రదేశ గ్రంథాలయసంఘము స్థాపించి చాలాకాలము గడచినప్పటికీ తగినంతగా నిర్మాణయుతం కానందుకు ఎవరిపైననూ దోషము ఆపాదించలేము. కాలం గడుస్తున్నకొద్దీ వున్నస్థితిపై అసంతృప్తి, క్రొత్త మార్గాల అన్వేషణ కలగటం సహజం ఆ దృష్టితో యిదివరకు గ్రంథాలయసంఘం ఉద్యమప్రచారం చేసినప్పటికీ, నిర్మాణాన్ని గురించి అంతగా ఆలోచించే అవకాశం లేకపోయింది.

సంఘనిర్మాణాన్ని ఆలోచించటానికి ముందు ప్రచారంలో కలిగిన దృక్పథభేదాన్నికూడా మనము దృష్టిలో వుంచుకొనవలెను. ఇంతకు పూర్వం గ్రంథాలయోద్యమప్రచారం అంటే గ్రంథాలయాల ప్రయో

జనాలను వివరించి దానివల్ల పుణ్యమూ, పురుషార్థమూ వున్నదనిచెప్పి గ్రంథాలయాలను నెలకొల్పించుట, వూరూర గ్రంథాలయసభలనూ, యాత్రలనూ చేయించుట. ఇది ఉద్యమ ఆరంభస్థితిలో చేసిన ప్రచారం, చేయవలసిన ప్రచారంకూడా.

ఈనాడు గ్రంథాలయాల ప్రయోజనాలను, దానివల్ల కలిగే ఆధ్యాత్మిక, ఆధిభౌతిక ఫలితాలను మనము వివరించ పనిలేదు. ప్రజలలో అభివృద్ధికి రావలెననే ఆకాంక్ష కలుగుతునేవున్నది. నేను చేయవలసింది క్రమపద్ధతిపైన గ్రంథాలయాలను నడిపించుకోమ్మని ప్రబోధించి, ప్రజలకు నిత్యజీవితంలో గ్రంథాలయంతో అవసరమూ, అభిరుచీ కలిగేటట్లూ, ఆయూలాగ్రంగా ప్రజలకూ, గ్రంథాలయాలకూ సన్నిహితసంబంధము కలిగేటట్లూ పద్ధతుల నాలోచించి ప్రచారం లోకి తీసుకరావడం.

పై సూత్రాన్ని అంగీకరిస్తే మనం ప్రస్తుత ఉద్యమవిధానంలో కొంతమార్పు తీసుకరావలసిన అవసరం మనకు కనబడుతుంది. ఉద్యమ ప్రచారదృష్టితో కాబోలు యిదివరకు జిల్లా, తాలూకా, పట్టణ గ్రంథాలయసంఘాలు నెలకొల్పినారు.

ఈవికేంద్రీకరణ విధానము మన అనుభవంలో అంత ప్రయోజనకారిగా రుజువుకాలేదు. వికేంద్రీకరణవిధానమంటే నాఉద్దేశం జిల్లా సంఘాలూ, తాలూకా సంఘాలూ, నగర పట్టణ సంఘాలూ విరివిగా నెలకొల్పి వారివారి సేవారంగాలలో జరిగేవుద్యమానికి వారిని మాత్రమే బాధ్యులుగాచేసి, యావత్తురాష్ట్రానికి సంబంధించిన కొన్ని సమస్యలలో మాత్రమే ఆంధ్రదేశ గ్రంథాలయసంఘము బాధ్యతవహించుట. ఉద్యమం బాగా బలపడి విస్తృతమై బాధ్యతగమనించిన సేవకులు అధిక సంఖ్యలో లభించినప్పుడు ఈవిధానమువల్ల కేంద్రపుపని తేలికఅవుతుంది. కాని ఉద్యమం ప్రాథమికదశలోనే వుండి తగినంతమంది సేవకులులేని ఈరోజులలో ఈవిధానము ఎంతవరకు ఫలవంతమౌతుంది అనేది ఆలోచించవలెను. ఈవిషయంలో మన అనుభవం స్పష్టంగానే వున్నది. శాఖాసంఘాలు ఆయాప్రాంతాలలో వుద్యమాన్ని వ్యాపింపజేసేకృషి

చేయలేదు. కేంద్రము ఆబాధ్యత వహించటానికి గ్రంథాలయాలతో ప్రత్యక్షసంబంధము చాలా తక్కువయింది. ఈవిధానము ఫలవంతము కాలేదని తెలియగానే మనకు తెలియకుండానే కేంద్రీకరణవిధానం అవలంబించాం. ఆయాశాఖాసంఘాలు వాటివాటి ప్రాంతాలలో ఉద్యమాన్ని నిర్వహించినా, నిర్వహించకపోయినా కేంద్రమే జోక్యము కలిగించుకొని ఆయాప్రాంతాలలో పనిచేయుట. అనగా ప్రధానబాధ్యతను కేంద్రమేతీసుకొనుట. ఈఅనుభవము కొంతవరకు ఫలకారి అయినది. దానితో గతసంవత్సరం నిర్మాణవిధానంలో పూర్వంకన్న యెక్కువగా కేంద్రీకరణ విధానమే అనుసరించారు. నిర్ణీతరుసుము చెల్లించి కేంద్రముతో అనుబంధించుకొని తనసేవారంగానికి తానే బాధ్యతవహించే పూర్వపద్ధతి మానివేసి సభ్యత్వరుసుములో కొన్నివాటాలు నిర్ణయించి కేంద్రానికి, శాఖాసంఘాలకు, గ్రంథాలయాలకుగల సంబంధాన్ని దృఢతరంచేశాం. శాఖా సంఘాలను పెట్టుకొనుటకు లేదా నిర్వహించుకొనుటకు ఒక కనీస సేవాపరిమాణాన్ని నిర్ణయించాం. కాని శాఖాసంఘాలు ఈకట్టుబాటునుకూడా పాటించినట్టు కనపడటంలేదు. క్రొత్తశాఖాసంఘాలను నెలకొల్పుటను మనము ప్రోత్సహించరాదనే నిర్ణయమే సరియైనదని కన్పడుతున్నది. మనము తెలంగాణాలోనూ, రాయలసీమలోనూ ప్రత్యేక కార్యాలయాలను నెలకొల్పి, ఆంధ్రదేశ గ్రంథాలయసంఘమే నేరుగా పనిచేసేపద్ధతి యెక్కువ ఫలవంతంగా పనిచేసింది. మునుముందుకూడా శాఖాసంఘాలు లేనిచోట్ల కేంద్రమే నేరుగా సంబంధముకలిగించుకొని పనిచేయవలయును. శాఖాసంఘాలు బాగా పనిచేయు లేకపోతే ఆ విషయాన్ని ప్రజలకు నచ్చజెప్పి మన అనుభవాన్ని వారికి చూపించి కేంద్రమే నేరుగా పనిచేసేటట్లు యేర్పాట్లు చేయవలెను. పనిచేయని శాఖాసంఘాలబరువు ప్రాణంలేని మనుష్యుల మోతబరువు మోస్తరుగనే నిరర్థకము. పైగా సేవారంగంలో అనేక అనవసరమైన పేచీలువస్తుంటవి. ఉదాహరణంగా ఒకజిల్లాసంఘాన్నో, తాలూకాసంఘాన్నో తీసుకోండి ఇది స్వయంగా పనిచేయదు. కేంద్రమే జోక్యంకలిగించుకొని ప్రచారకుని పంపిస్తే దానిఫలితంగా వచ్చిన సభ్యత్వరుసుములో జిల్లాసంఘం

వారు వంతుకోరవచ్చు. కేంద్రము ఆజిల్లాకు ప్రచారార్థము వినియోగించినసొమ్మునకు ఆజిల్లాసంఘము యేమీ బాధ్యతవహించదు. ఇంతే కాదు. ఆయాజిల్లాలలోవున్న కార్యకర్తలకు శిక్షణ యిప్పించటంలో కూడా యేజిల్లాసంఘం కానీ, తాలూకాసంఘంకానీ కృషి చేయటంలేదు.

గ్రంథాలయసంఘ పాలకవర్గంలో ఉద్యమంతో ప్రత్యక్షసంబంధము లేనివారిని తీసుకునేపద్ధతి క్రమక్రమంగా మానివేయవలెను. ఉద్యమనిర్వాహకులు కష్టసుఖాలను వివరించిచెప్పితే సభ్యుల కవి నచ్చక పోవు. వెంటనేకాకున్నా కొంతకాలమైనతరువాత గ్రంథాలయోద్యమం నిమిత్తము కృషిచేసేవారికే యెన్నికపదవులలో స్థానం కల్పించటం అంతకష్టం కాదనుకుంటాను.

గ్రంథాలయోద్యమ ప్రచారకులకు, నిర్వాహకులకు కేంద్ర సంఘమే శిక్షణనిచ్చి ఆయాప్రాంతాలలో నియమించి నేరుగా తనపరిశీలనలోనే వుంచుకొనవలెను. ఏశాఖాసంఘమో తనరంగంలోగల సేవకులకు ప్రత్యేకశిక్షణనిచ్చి నియమించేదానికన్నా, కేంద్రమే పూనుకుంటే పనిలో తేలిక, సామ్యమూ, క్రమపద్ధతీ యేర్పడుతుంది. అవసరాన్నిబట్టి ఒకేప్రచారకుడు వివిధప్రాంతాలలో కొంతకొంతకాలమయినా ప్రచారంచేసే వీలుంటుంది. వివిధకార్యకర్తలూ క్రమశిక్షణకు కట్టుబడివుంటారు ఒకప్రాంతము వారు మరొకప్రాంతానికి పోవటంమూలంగా ఒండొరుల కష్టసుఖాలనూ, పరిస్థితులనూ తెలుసుకుంటారు. ఎవరికి వారే అనేభావము క్రమేపీ నశిస్తుంది.

ఉద్యమప్రచారకులు గ్రంథాలయోద్యమ శిక్షణము పొంది యుండటమేకాకుండా నిర్వహణలో కూడా కొంత అనుభవము గడించవలెను. ఆయా గ్రంథాలయాలను పరిశీలించి క్రమపద్ధతులను వారికి బోధించి ఆగ్రామ లేక పరిసరప్రజలకు ఆగ్రంథాలయము యెడల అభిమానం కలిగించగల సమర్థులై వుండవలెను. అవసరమైతే కొన్ని పల్లెలనుకలిపి ఆయా గ్రంథాలయ నిర్వాహకులకు వారంరోజుల పాటయినా శిక్షణను యివ్వగలవారై యుండవలెను. అట్టి ప్రచారకులు ఎక్కువ సంఖ్యలో దొరకకున్నా స్వల్పసంఖ్యలో దొరికినా వారివలననే

ప్రయోజన మంటుంది. దీనివలన ఖర్చు కొంత అధికం కావచ్చును. కాని ఖర్చుకుతగ్గ ఫలితం చేకూరుతుంది. ప్రజలకు గ్రంథాలయము మందు అభిరుచి కలిగించే నిమిత్తం ఆయా స్థానిక సమస్యలను లేదా రాజకీయ ఆర్థిక సమస్యలను వివరిస్తూ, "ఈ విషయాలు వివరంగా తెలుసుకోవాలంటే గ్రంథాలయాలకు వెళ్ళండి" అని ప్రచారకులు ప్రబోధించవలసి వుంటుంది. స్థానికులు చెప్పిన దానికంటె పరస్థానికులు చెప్పినదానిమీద ప్రజలకు అభిరుచి యెక్కువ. అందుకై గ్రంథాలయ సేవకులను సంవత్సరానికి మూడునాలుగు సార్లయినా గోష్ఠి రూపంగా సమావేశపరచి వారివారి అనుభవాలను, వారు ఎదుర్కొనవలసివస్తున్న కష్టాలను, అనుసరించే పద్ధతులను, క్రొత్తమార్గాలను చర్చకై పెట్టవలెను.

ఒకటిరెండు పత్రికలను గ్రంథాలయోద్యమానికి సంబంధించిన వార్తలను, వ్యాసాలను ప్రకటించే టందుకు యేర్పాటు చేసుకొని ఆ పత్రికలను విధిగా గ్రంథాలయాలవారు తెప్పించవలెనని ప్రోత్సహించవలసి వుంటుంది.

గ్రంథాలయోద్యమ ప్రచారకునికి గ్రంథాలయ నిర్వాహణకు సంఘము కొంత అనుభవమును గడించినతరువాత సాధారణ స్థాయిని నిర్ణయించి దాని కనుగుణ్యమైన వివిధ విషయాల పరిచయము, వ్యవహారజ్ఞానము కలిగే విధానాలు ఆలోచించవలెను. ఈ విషయంలో కొన్ని పాఠ్యగ్రంథాలను నిర్ణయించి చదివించుట మంచిది.

మన గ్రంథాలయాలు అధికభాగము గ్రామాలలోనే వున్నవి. మన గ్రంథాలయోద్యమము గ్రామ గ్రంథాలయోద్యమమని చెప్పిన అతిశయోక్తిలేదు. గ్రామీణుల విద్యాస్థాయి ప్రస్తుతము చాలా తక్కువగా వున్నది. గ్రంథాలయాల ఆర్థికపరిస్థితికూడ యేమంత బాగాలేదు. అందుకై పెద్దపెద్ద ఉద్గ్రంథములను,కఠినశైలిగల గ్రంథాలనూ తెప్పించి గ్రంథాలయాలంతగా ప్రయోజనం పొందటం లేదు. కాబట్టి యిట్టి గ్రంథాలకు క్లుప్తీకృత గ్రంథాలను (Abridged Editions) సులభశైలిలో వ్రాయించి ప్రకటించేటట్లు ప్రకాశకులను ప్రోత్సహించవలెను.

ఈవిషయంలో నిజాంరాష్ట్రాంధ్ర సారస్వతపరిషత్తువారు ప్రకటించిన 'ఆంధ్రుల చరిత్రము' ఆదర్శముగా వున్నది.

ఏయేగ్రంథాలు ఎట్టిగ్రంథాలయాలకు అవసరమో గ్రంథాలయ సేవకుల గోష్టిలో ప్రధాన చర్చనీయాంశముగా వుంచుకోవలెను. నేటి గ్రామగ్రంథాలయాలస్థాయి మొదటి సంవత్సరము 100 రూపాయలు, తర్వాత ప్రతి సంవత్సరమూ 25 రూపాయలు ఆదాయాని కంటె మించిన స్థితిలో లేదు. గ్రంథాలయసంఘము సాధారణ శైలిలోగల క్లుప్తీకృత గ్రంథాల పట్టికను 100 రూపాయలలో కొనగలిగిన పుస్తకములు (కనీసం 100 పుస్తకాలు) కలవానిని ఒకటి ప్రకటించవలెను. ప్రతిసంవత్సరమూ 50 రూపాయల విలువగల నూతన గ్రంథముల జాబితాను ప్రకటించవలెను. అట్లాగే గ్రంథాలయాలు విధిగా తెప్పించవలసిన పత్రికల పట్టికకూడాయిస్తూ ఆయా పత్రికలలోని విశిష్టతను గ్రంథాలయ సేవకులకు తెలుపుచుండవలెను.

గ్రంథాలయోద్యమ ప్రచారం నిమిత్తము ప్రత్యేక పత్రిక పెట్ట గలిగేదాక యితర నిర్మాణకార్యక్రమ అంశాలతో కలిపి ప్రచారం సాగించేటందుకు ఒక పత్రికను నెలకొల్పవలెను. ఇది ప్రస్తుతము సాధ్యముకాని పక్షంలో 'బులెటిన్' ఒకటి అప్పుడప్పుడూ ప్రచురిస్తూ వుండవలెను.

వ్రాతపూతలలోనే కాక శ్రవ్యపద్ధతులద్వారా కూడా విజ్ఞాన ప్రచారం చేయవలసి వుంటుంది. దానిని గురించి మరొకసారి విచారించవచ్చు.

# గ్రంథాలయోద్యమ ప్రచారాని కొక ప్రణాళిక

శ్రీ పాతూరి నాగభూషణం, బి. యల్. యస్.
ఆం. దే. గ్రం. సంఘ కార్యదర్శి

ముప్పదేండ్లకు పైబడి ఆంధ్రదేశగ్రంథాలయ సంఘం నిరంతరాయంగా మనదేశంలో ప్రచారం చేస్తూవున్నది. ఇప్పటికి మనం రాష్ట్ర, జిల్లా, తాలూకా మహాసభలు చాలా జరిపినాము. కాని, తృప్తికరమైన అభివృద్ధిని మనం పొందలేదు. దీనికి కారణాలు వెదకుతూ రావడంలో నాకుతోచిన అంశాలను మీయెదుట బెట్టదలచినాను. నిర్మాణయుక్తమైన యొక ప్రణాళికనుకూడ నా యీ వ్యాసములో సూచించదలచినాను.

ఏకార్యక్రమంగాని సక్రమాభివృద్ధిని సాధించాలంటే ఒక నిర్ణీతమైన ప్రణాళికను తయారుచేసికొని దానిప్రకారం ఆదర్శాన్ని సాధించడానికి మెట్టుమెట్టుగ పనిచేస్తూ పోవడమవసరం. కేవలోత్సాహం ఆచరణలోకిరాని తీర్మానాలతో ముగిసే మహాసభలవల్ల తాత్కాలికానందం తప్ప చెప్పుకోదగ్గ ఫలితాలేమీ యుండవని నావిశ్వాసం. వందలు వేలు వెచ్చించి, అధికవ్యయ ప్రయాసాలతో మనం సాగించే మహాసభలలో కార్యతత్పరులకు రానురాను ఆసక్తి సన్నగిల్లడం జరుగుతుంది. మహాసభల ప్రయోజనాన్ని సరిగ గుర్తించక, ఉద్యమ ప్రాశస్త్యాన్ని గమనించక, గ్రంథాలయ నిత్యసేవతో చాలినంత సంబంధంలేక రకరకాలైన అనేకోద్యమాలతో జీవితంలో తీరికలేనివ్యక్తులతో జరిగే సభలు మురిపెంగా పరిణమిస్తాయేగాని ముందు కార్యక్రమానికి దారిని చూపవని నామతం. ఈపరిస్థితిని దాటడం ప్రస్తుతంలో సులువుగాదని యెరుగుదును. సుశిక్షితులును, సమర్థులును నైన భాండాగారులు గ్రంథాలయనిర్వాహకులుగ నేర్పడి ఉద్యమవ్యాప్తికై కృషిసల్పేనిమిత్తం ముందుకు వచ్చేవరకూ మనకీస్థితి తప్పదు. అనిచెప్పి అంతవరకు మన మూరకుండుట తగదుగదా! ఉన్నసాధనాలతో మనం నిర్మాణాన్ని సాగించాలి. ఆత్మపరిశీలనద్వారా మన లోపాలను తెలిసికొని వీనిని సరిదిద్దడానికి గట్టిప్రయత్నాలు చేయాలి.

ఉద్యమాభివృద్ధికి మూలాధారం ప్రచారం. ఇప్పుడు మనం సాగిస్తున్నది ప్రచారశాఖా సమావేశం. ఇందు నిమిత్తం గతసంవత్సరం ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘంలో ప్రత్యేకంగా ఒక శాఖకూడ యేర్పడింది. కాని పని జరగలేదు. కనీసము ప్రణాలికయైనా తయారుకాలేదు. దీని విషయమై ఇంకా జాగుచేయడం బాగాలేదు. ఈ బాధ్యత మరొకరిపై నున్నందున ఇప్పటివరకు దీనినిగూర్చి నేను యోచించలేదు. ఏకాకిగ గాలిలో మేడలుకట్టడంవల్ల ప్రయోజనముండదు. కనుక ఉద్యమ కార్యకర్తలు, అభిమానులు చేరిన ఈ సమావేశంలో అందరితో కలసి ఆలోచనచేసి ముందు కార్యక్రమాన్ని నిర్ణయించే సంకల్పంతో ఇప్పుడీ ప్రస్తావనకు పూనుకొన్నాను.

ఆంధ్ర గ్రంథాలయోద్యమము యొక్క కార్యరంగం విశాలాంధ్రం. ఇంతవరకు చెన్నరాజధానిలోని కోస్తాజిల్లాలలో సాధారణంగాను, కొన్నింటిలో ఎక్కువగాను మనపనిసాగింది. తెలంగాణాలో కూడా ఒకటి రెండు జిల్లాలలో మన ఉద్యమం కొంత అభివృద్ధి పొందింది. ౨౧ వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభానంతరం తెలంగాణాలోని కార్యక్రమం ప్రత్యేకంగా ఖమ్మంమెట్టులో నెలకొల్పిన తెలంగాణా శాఖాకార్యాలయంద్వారా జరుగుతూవుంది. ఈమధ్యనే రాయలసీమపనికై ఒక ఆర్గనైజరును నియమించాము. నంద్యాలలో రాయలసీమ శాఖాకార్యాలయాన్ని ఏర్పరచే సన్నాహం సాగుతుంది. పశ్చిమ గోదావరి జిల్లాలో నవంబరు నెలాఖరునుండి మరియొక ఆర్గనైజరు పనిచేస్తున్నారు. 1943 వ సం. లో గుంటూరు జిల్లాలో 4 మాసాలొక ప్రచారకులు ప్రచారంచేశారు. కాని అన్నిప్రాంతాలలో కార్యక్రమం సమానంగానూ, నిరంతరాయంగానూ సాగితేనే తప్ప మన యుద్యమానికి ప్రయోజనముండదు. ఆంధ్రదేశ గ్రంథాలయ ఉనికికి అర్థముండదు. ఈ సంగతిని గమనంలో నుంచుకొని మనం కార్యక్రమాన్ని సాగించాలి. దీని బాధ్యతను ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘం వహించి యావదాంధ్రంలో గ్రంథాలయ ప్రచారం బహుముఖాల వ్యాప్తిచెందేలాగు చూడాలి. దీనికి నేనాలోచించిన విధానాన్ని వివరి

స్తాను. అమలు జరుపలేని ఆలోచనలను విడచి మనం సాగించగల కార్య క్రమాన్నే ఇప్పటికి చెబుతాను.

ప్రధానంగా ఆంధ్రదేశాన్ని మన సులువుకొరకు క్రిందివిధంగా విభజిస్తాను.

1. తెలంగాణము
2. రాయలసీమ
3. మదరాసురాజధానిలోని తెనుగుజిల్లాలు (మదరాసునగరం, చెంగల్పట్టుజిల్లాతో చేర్చి)
4 ఒరిస్సారాజ్యమందలి గంజాం, కోరాపుట్టిజిల్లాలు
5. మధ్యపరగణాలలోని ఆంధ్రప్రాంతము
6. మైసూరుసంస్థానములోని ఆంధ్రప్రాంతము
7. తదితర ఆంధ్రకేంద్రములు

ఆంధ్రదేశ గ్రంథాలయసంఘ పరిశీలనక్రింద ప్రస్తుతం పనిచేస్తున్న తెలంగాణా కార్యాలయ కార్యదర్శికితోడు నిజాంరాజ్యములోని జిల్లా లన్నింటిలోనూ ప్రచారంనిమిత్తం ఇద్దరు ప్రచారకుల నియమించాలి. రాయలసీమపనికి మరి యిద్దరు ప్రచారకుల నేర్పఱచి రెండు కేంద్రాల నుండి చిత్తూరు, అనంతపురం, బళ్ళారి, కర్నూలు, కడపమండలము లతోపాటు మైసూరుసంస్థానములోకూడ పనిని సాగించాలి. ఉభయ విశాఖలు, ఉభయగోదావరులు, కృష్ణా, గుంటూరు, నెల్లూరు, మద, రాసు, చెంగల్పట్టు జిల్లాలపనికి 4 గురు ప్రచారకులు నియమించ బడాలి, అవకాశమునుబట్టి గంజాం, కోరాపుట్టి జిల్లాలపనికికూడ నెమ్మ దిగ నొకప్రచారకుని నియమించడ మవసరం. మిగిలిన ప్రాంతాలపనిని రాష్ట్రేతరాంధ్రవిద్యాపరిషత్కార్యకర్తలు చూచుటకు మాటయిచ్చి నారు. వీరుతమపరిషత్తు పక్షమున గ్రంథాలయశాఖ నేర్పఱచి రాష్ట్రేతర రాంధ్రులలో మామూలు చదువుల వ్యాప్తితోపాటు విజ్ఞానవ్యాప్తిని కూడ సాగించదలచినారు. ఇప్పటికి మన తక్కినప్రాంతాల కార్య క్రమాన్ని వీరిద్వారా సాగించడం సముచితంగా తోస్తుంది. పోతే మిగి

లిన కోస్తాజిల్లాలపనికి దిగువవిధంగా ప్రచారకుల నియామకం జరుగ వలసి వుంటుంది.

ఉభయ విశాఖజిల్లాలకు ఒకరు, ఉభయ గోదావరులకు ఒకరు, గుంటూరు, కృష్ణాజిల్లాలకు ఒకరు, నెల్లూరు, మదరాసు, చెంగల్పట్టు జిల్లాలకు ఒకరు.

తెలంగాణము, రాయలసీమ ప్రచారకులను ఆప్రాంతాలలోనే ఉంచవలసివచ్చినా కోస్తాజిల్లాల ప్రచారకులను కొంతకాలం గడచిన తర్వాత ఒకచోటినుండి మరియొకచోటికి బదిలీచేస్తూ పని సాగిస్తూ వుంటే వారు కొత్త పరిచయాలు చేసుకొంటూ ఉత్సాహంగా పనిచేయ డాని కవకాశ ముంటుంది. ఈవిధంగా ఏర్పడిచే ప్రచారకు లందరికీ కుటుంబపోషణకు సరిపోయే భృతీ, ప్రయాణాది ఖర్చుల భరించు టేగాక వేతనంలో క్రమాభివృద్ధి, ప్రావిడెంటుఫండు మొదలైన సౌకర్యాలుకూడ మనం యేర్పాటుచేస్తే నేతప్ప మన కార్యక్రమం నిలకడగసాగి యోగ్యు లైనవారు మన పనిలో ప్రవేశించరు.

దీని కంతటికీ ధనం చాల అవసరం. అయితే మూలనిధి యేర్పడేవరకు మన మూరకుండ పనిలేదు. ప్రచారకులు సరిగ పని చేస్తూవుంటే వారి ఖర్చులవరకైన ప్రచార సందర్భంలో వారు సంపా దించుకోగలరు. అదనంగాకూడా సంఘ కార్యక్రమానికి వీరు ధనాన్ని సేకరించగలరు. లోగడ మా అనుభవం ఈ అభిప్రాయాన్ని ధృవపరు స్తుంది. అయితే ప్రాంతీయవ్యక్తులు, గ్రంథాలయ సంఘాలు వీరికృషికి తోడ్పడాలి. కేంద్రసంఘంతో తా మైక్యముగ నుంటేతప్ప ఈ పని విజయవంతంగా సాగదు. నిజానికి ప్రచారకుల పోషణబాధ్యత నాయా ప్రాంతీయులు, జిల్లా-తాలూకా-నగర గ్రంథాలయ సంఘాలు వహిం చడం ముఖ్యం. అట్లని ప్రాంతీయసంఘాలకు ప్రచారకుల నియామకం పనిని వదలడం కుదురదు. విశాలాంధ్రాన్ని ఆవరించి పనిచేస్తున్న ఆంధ్రదేశ గ్రంథాలయసంఘమే సమర్థులైన ప్రచారకుల్ని సంపా దించడం కష్టంగావుంది. స్థిరంగా నడువవలసిన ఈ కార్యక్రమం కేంద్రీ కరణ పద్ధతిని నడువవలసి వుంటుంది. లేకుంటే సంఘనిర్మాణం బల

పడడం కష్టం. ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘం ద్వారా ఈ కార్యక్రమాన్ని సమీకరణ చేసి నడిపేపక్షంలో ఉత్సాహులును, సమర్థులునైన ప్రచారకుల్ని మన మాకర్షించగలం. అప్పుడు నిరంతరాయంగా మనపని నడుస్తుంది. ప్రచారకుల కార్యక్రమం నిర్ణయించేముందు ప్రాంతీయ సంఘాల సలహా గైకొని వారిసహాయంతో పని సాగించే యెడల కేంద్రసంఘం ఆధ్వర్యాన ప్రచారకులు పని చేయడంమూలంగా ఇబ్బంది కలుగదు.

పైన తెలిపిన పథకం ప్రకారం ఏర్పడ్డ ప్రచారకులకు ప్రత్యేక శిక్షణ మివ్వడమేగాక సంవత్సరంలో కనీసం రెండుమూడు పర్యాయాలైనా వీరందరినీ సమావేశపరచి, పరస్పరం అనుభవాల తెలుపుకొని, ప్రచారంలో వీరి నెదుర్కొంటున్న సమస్యలకు పరిష్కారమార్గాల వెదకి, తమ కార్యక్రమంలో అభివృద్ధిని సాధించడానికి చేయవలసిన మార్పుల సూచించడాని కవకాశముండాలి. సంఘసహాయ కార్యదర్శులలో నొకరు వీరితో కలసి ప్రచార శాఖపనికి బాధ్యతవహించేపక్షంలో గతసంవత్సరంలో ఆంధ్రదేశ గ్రంథాలయసంఘంవా రేర్పరచిన ప్రచార శాఖపని చక్కగా సాగడాని కవకాశముంటుంది.

ప్రచారకార్యక్రమ మెలాజరగాలో వివరాలు తెలపడానికి సమయంచాలదు. ఆలు లేదు, చూలు లేదు, కొడుకు పేరు లింగడన్న సామెత ప్రకారం ఈపథకం ఆచరణలోనికి రాకముందు ముందు కార్యక్రమాన్ని గూర్చి ఊహాగానం చేయడంవల్ల ప్రయోజనముండదు. ఇచ్చట చేరిన సోదర గ్రంథాలయసేవకులు ఉద్యమాభిమానులు నాసూచనలగూర్చి ఏమి చెప్పుదురో తెలిసికోవడం నాసంకల్పం. నిర్మాణయుక్తంగా మీరు చేసేసూచనల నాధారంచేసికొని పైప్రణాళికనుఅవసరమైనమార్పులతో ఆంధ్రదేశగ్రంథాలయసంఘంవారు వీలైనంతత్వరలో అమలు చేయగలరని నాయాశ. దీనికి దేశంలోని ఉద్యమాభిమానులంతా అన్నివిధాల సహాయపడగలరని నమ్ముతున్నాను. మహాసభలో నిన్నటిదినం అధ్యక్షులు శ్రీ రాజాబహద్దరువారు చూపినమార్గాన్ని ఆహ్వానసంఘాధ్యక్ష కార్యదర్శులు, ఇచ్చటచేరినపెద్దలు అనుకరించేయెడల గ్రంథాలయోద్యమప్రచారం విరివిగ సాగగలదు.

# *నిజాంరాష్ట్ర ఆంధ్ర గ్రంథాలయోద్యమం

శ్రీ కోదాటి నారాయణరావు గారు

సభాపతీ! సోదర సభ్యులారా!

ఆంధ్రుల మానసిక ప్రవృత్తికీ గ్రంథాలయోద్యమ తత్వానికీ అవినాభావ సంబంధమున్నది. అందు ప్రభుత్వ మన్నన బడసిన బరోడాలో తప్ప, సార్వజనీన గ్రంథాలయోద్యమం విషయంలో ఆంధ్రులనే ముందు చెప్పవలసి వస్తుంది. ఇతర ప్రాంతాలలో పెద్దపెద్ద గ్రంథాలయా లుండవచ్చు. అతి నూతన పద్ధతు లవలంబించ వచ్చును. కాని మారుమూలల పల్లెలలో ప్రచారములేక ప్రోత్సాహకులు లేక శిక్షకుడులేక గ్రంథాలయాలు స్థాపించబడటము అరుదు. దేశంలో చైతన్యం బొత్తిగా లేనినాడే, గ్రంథవార్తాపత్రికా ప్రచారము విరివిగా సాగనప్పుడే ఆంధ్రులహృదయాన్ని గ్రంథాలయోద్యమం ఆకర్షించింది. ఆనాడే దిక్కుగానక యేదో ఒక పంథా అవలంబించినారనికాదు. నేటిదనుక నిత్యకల్యాణము,పచ్చనితోరణంగా వృద్ధిజెంది ఆంధ్రజాతీయత నవజీవనోద్యమంలో బలమైన స్థానాన్ని సంపాదించుచున్నది. శ్రీ మాడపాటి హనుమంతరావు గారన్నట్టు ఏదైనా పల్లెపట్టులో గ్రంథాలయం స్థాపించబడిందంటే దేశస్థితికి బాధపడే ఒకపేదవాని హృదయం కనుపించిందన్నమాట.

ఈవిధంగా ఆంధ్రుల జాతీయోద్యమానికీ, గ్రంథాలయోద్యమానికీ గల అవినాభావసంబంధాన్ని విశదీకరిస్తూ గ్రంథాలయోద్యమ స్వభావానికీ ఆంధ్రుల మానసికతత్వానికీ లంకె ఉన్నదని మనసభాపతి బూర్గుల రామకృష్ణారావుగారు 1927లో సెలవిచ్చారు. ఆంధ్రోద్యమమనుపేర బేర్కొనబడు రాజకీయ, సాంఘిక, వైజ్ఞానిక విషయములగు పలు పరిశ్రమలయందు గ్రంథాలయోద్యమము ప్రత్యేకసభ్యతను వికసింపజేయుటకు మిక్కిలి అనువైనదగుట చేతనూ, వారి విలక్షణ

* ఈవ్యాసం 31గే వ ఆం. దే. గ్రం. మహాసభలో చదువబడింది. కనుక తరువాత జరిగిన పరిణామాలు ఇందు కానరావు.

జాతీయ స్వభావమున కనుకూలమైన దగుటచేతను ఆంధ్రజనసామాన్యముచేత వారి సహజ ఔదార్యమును వెల్లడిచేయు స్వాగతమును బడసినది. ఇట్లు స్వాగతమొసంగబడి నిరంతరకృషిచే దోహదమొనరింపబడి కొంతవరకాంధ్రేతర ప్రాంతముల కాదర్శప్రాయముగా దైనందినాభివృద్ధి నందుచున్నది.

1872 లో సికిందరాబాదులోని శంకరారాధ్యమఠంలో గ్రంథాలయము స్థాపించబడినట్టు తెలుస్తున్నది కాని దానిచరిత్ర నేడు లభించదములేదు. అది యెంతవరకు ప్రజాసేవచేసిందో తెలియడములేదు. కాబట్టి శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయమే తెలంగాణపు గ్రంథాలయోద్యమానికి నాందిగా లెక్కిస్తున్నాము. 20వ శతాబ్దము, నిజాం రాష్ట్రాంధ్ర గ్రంథాలయోద్యమం ఒకేసారి ప్రారంభమైనవి. పైనిలయపుకృషిచేతనూ, అప్పుడప్పుడే ఆంధ్రజాతీయ పునర్నిర్మాణాభిలాష విద్యార్థుల్లో వెల్లడియౌచుండుటయున్నూ ఆనాడు విద్యార్థులున్నూ, ప్రజాసేవాభిలాషులున్నూ అయిన యువకులయందు ఉత్సాహం పురికొల్పింది. వరంగల్లులోని హనుమకొండలో 1904లో రాజరాజనరేంద్రాంధ్ర భాషానిలయం స్థాపించారు. శ్రీహనుమంతరావుగారి సేవా నిరతికిది బహుశా తొలితాంబూలం. 1905 లో సికింద్రాబాదులో ఆంధ్రసంవర్ధిని స్థాపించబడింది. 1906లో బెంగాలువిభజన సందర్భమున ప్రారంభమైన వందేమాతరఉద్యమం ఆంధ్రదేశంలో జాతీయ పునర్నిర్మాణ ఉద్యమాన్ని ప్రారంభించి దేశభాషాభిమానాన్ని పురిగొల్పింది. ఆప్రభావము తెలంగాణాయువకుల పైబడి కొన్ని గ్రంథాలయాలు స్థాపించటానికి కారణభూతమైంది. ఈవిధంగా 1906-16 వరకు పది సంవత్సరాలలో ఆనాడు విద్యార్థిదశనుండి ప్రాపంచిక జీవనంలో అప్పుడప్పుడే ప్రవేశించిన యువకుల హృదయాల్లో స్థానం సంపాదించి దేశంలో స్వల్పంగానైనా చైతన్యం కల్గించింది. 1916 వరకు దేశంలో చైతన్యం కొద్దిగానే వుండటంవల్లనూ, ఆనాటిసేవకులు ప్రజాసేవలో చాల తక్కువమంది నిల్చియుండటము వల్లనూ, గ్రంథాలయాలు అధికసంఖ్యలో వృద్ధికాలేదు. హోంరూలు ఉద్యమంమూలంగానూ,

ఆంధ్రరాష్ట్రోద్యమం, గ్రంథాలయోద్యమం మూలంగానూ, అప్పటి దేశంలో జరిగిన కృషిమూలంగానూ, బ్రిటీష్ ఆంధ్రదేశంలో 1914లో గ్రంథాలయోద్యమం ఒక ఉద్యమస్వరూపం దాల్చింది. దానిఫలితం తెలంగాణాలో 1917నుంచిచైతన్యం హెచ్చుస్థాయిని అందుకొన్నది. గ్రంథాలయోద్యమం కట్టుదిట్టంగా సాగటం ప్రారంభించింది. 1916 తర్వాత స్థాపింపబడే గ్రంథాలయాలలో కొంతమార్పు కనిపిస్తుంది. 1916వరకు కేవలం ప్రభుత్వోద్యోగులూ, ముఖ్యంగా ఉపాధ్యాయులూ, వకీళ్ళు ఈఉద్యమంలో ఎక్కువగా ఉండేవారు. 1916 నుండి వర్తకులు కూడా శ్రద్ధవహించడం మొదలుపెట్టారు. గ్రంథాలయోద్యమంతో పాటు సంఘసంస్కరణ, వర్తకసంఘోద్యమంకూడా వర్ధిల్లినవి. 1921 నవంబరు 12వ తేదీన నిజాంరాష్ట్రాంధ్రజనసంఘం స్థాపించబడింది. మహారాష్ట్రులచే తిరస్కృతిబొందిన తమభాషాభిమానమే ఆంధ్రోద్యమానికి ప్రథమకారణమైనది. ఆంధ్రోద్యమ ప్రధానకార్య ప్రణాళిక గ్రంథాలయోద్యమం. దేశంలో అప్పుడప్పుడే మేల్కొంటున్నజాతి, అలసట నెరుగని హనుమంతరావుగారి నాయకత్వంలో గ్రంథాలయోద్యమాన్ని ఊతగాగొని ముందుకుసాగింది. 1925కు వీరికృషి ఫలితంగా సుమారు నూరు గ్రంథాలయాలు విలసిల్లినవి. ఆంధ్రాభ్యుదయం, నీలగిరి, తెలుగు పత్రికలు వర్ధిల్లినవి. గ్రంథమాలలు, రచయితలు బయలుదేరినారు. సభలు అక్కడక్కడ పల్లెటూళ్ళలో జరుగుట మొదలైంది. ప్రభుత్వం ఒక విధానంగా సాగించకపోయినా ప్రభుత్వోద్యోగులు కొందరు ఈ దేశాభివృద్ధి యత్నాలకు నిరోధాలు కల్గించడం అప్పుడప్పుడే ఆరంభమైంది. 20-8-1925న నీలగిరిపత్రిక వ్రాసిన సంపాదకీయంలో "మాడపాటి హనుమంతరావుగారు పలువిధములైన కష్టములకోర్చి దేశమునందు సుమారు నూరు గ్రంథాలయాలు స్థాపించి గత రెండు మూడు సంవత్సరములలో పల నిరుపమానమైన దేశభాషాసేవచేసి యున్నారు.

గ్రంథాలయములను వాచనాలయములను స్థాపించి, వాని మూలమున జనసామాన్యమున జ్ఞానబీజములను వెదజల్లుదని విద్యాశాఖవారిదయ్యు, వీరిపనిని యింతవరకు అవలంబించక పోవుటచే, ప్రభు

త్వమునకు తోడ్పడు నుద్దేశముతో ఈఉద్యమ మారంభింపబడినది. దీనిని విజయవంతముగా కొనసాగించుటకు మీరు కొన్నిచోట్లయందు మూసివేయించుటకు ప్రయత్నించుట; సంతాపకరమని నేనభిప్రాయ పడుచున్నాను. ... ... ..." అని ఉన్నది.

గ్రంథాలయాల స్థాపన వడివడిగా సాగింది. 1926 లో నిజాం రాష్ట్ర ప్రథమాంధ్ర గ్రంథాలయ మహాసభ ఆంధ్రజన కేంద్రసంఘ సమావేశంతోపాటు వరంగల్లు జిల్లాలోని మధిరలో జరిగింది. శ్రీ పింగల వెంకట్రామారెడ్డిగా రధ్యక్షత వహించారు. 28 గ్రంథాలయాల ప్రతినిధులు వచ్చారు. నిజామాబాదు జిల్లాలోని ఆర్మూరు తాలూకా వంటి మారుమూలల శ్రీ టి. కే బాలయ్యగారను యువకులు సంచార గ్రంథాలయాన్ని జయప్రదంగా నడుపుతున్నారని తెలుగు పత్రిక వ్రాసింది. 1925, 27 ల మధ్య అనేక గ్రంథాలయాల వార్షికోత్స వాలు జరిగినవి. దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావుగారి వంటి నాయకులు, పానుగంటి, చెళ్లపిళ్ల, టేకుమళ్ల రాజగోపాలరావు గార్ల వంటి పండితులు రావడం మొదలుపెట్టారు.

దేశభక్త వామననాయకుగారివంటి నాయకుల ధనవాక్సహాయ ములచేత, హనుమంతరావుగారివంటి కార్యసాధకుని మార్గదర్శకత్వాన పువ్వాడ వెంకటప్పయ్యగారివంటి దేశభక్తుల ప్రచారంమూలంగా గ్రంథాలయోద్యమం, ప్రజానీకంలో బలమైన స్థానం సంపాదించుకొన్నది. 1330 ఫసలీలోగష్తి 22 గ్రంథాలయాల పైవేటు విద్యాలయాల పైనను ప్రభుత్వోద్యోగులు కన్నుకాసి యుండవలెననే ఆజ్ఞ వచ్చింది. 1927 లో నీలగిరిపత్రికలో మాడపాటి హనుమంతరావుగారు 'గ్రంథా లయాలు, మన విద్యాభివృద్ధి' అనే విషయంపైన ఉపన్యసించబోగా అవ్వలు తాలూక్దారు (జిల్లాకలెక్టరు) ఆజ్ఞలేదని సర్కిల్ఇన్స్పెక్టరు ఆటంకపెట్టినాడనే వార్త గలదు. 1330 ఫసలీలో చరిత్ర ప్రసిద్ధిబడ సిన వాఙ్నిరోధక శాసనానికి మూలమైన ఫర్మాను ప్రకటించబడింది. దాని మూలగాగొని అనేకసభలు ఆపబడినవి.

1335 ఫసలీలో సూర్యాపేటలో జరుగవలసిన కేంద్రసంఘ సమావేశము, గ్రంథాలయ మహాసభ, నల్లగొండసభలు ఆపివేయబడ్డవి. దానిపై హైకోర్టులో వ్యాజ్యంవేసిన ప్రజలు గెలుపొందారు.

1337 ఫసలీలో భగీరథప్రయత్నంతో తిరిగి సూర్యాపేటలో సభలు జరిగినవి. ద్వితీయగ్రంథాలయ మహాసభ వామనునాయకు గారి అధ్యక్షతన జరిగినది. 1335 ఫసలీలో సభలు ఆపటం ప్రభుత్వ నిర్బంధాలు మొదలైనవాటివల్ల గ్రంథాలయోద్యమం సన్నగిల్లిందని 25 వ తీరు 1337 ఫసలీన శ్రీ హనుమంతరావుగారు తెలిపుచ్చారు.

శ్రీ వామన నాయకుగారు నెల1కి 25-0-0 చొప్పున గ్రంథాలయోద్యమ ప్రచారానికి సంవత్సరం వరకూ వేతనమిస్తామని వాగ్దానం చేసి ఇచ్చారు.

1330 ఫసలీ గస్తీనిషాన్ 22 రద్దుచేయవలెననీ, లోకల్ఫండు నిధినుండి గ్రంథాలయాలకు విరాళాల నివ్వవలెననీ, స్టేటులైబ్రరీ సెలవుల్లో తీసివుంచవలెననీ, స్టేటులైబ్రరీలో దేశభాషాగ్రంథాలు పెట్టవలెననీ తీర్మానాలు జరిగినవి. తర్వాత తిప్పర్తిసభలు ఆపబడ్డవి. రాజకీయ సభలు ఆజ్ఞలేనిదే చేసుకోరాదనే ఫర్మాను, ఏసభలైనా ప్రభుత్వానుమతి లేనిదే చేసుకోరాదనే రూపం దాల్చింది. దానితో ప్రజలలో వుత్సాహం చల్లబడింది.

ప్రభుత్వమే కాకుండా 'రహబరు'వంటి పత్రికకూడా ఆంధ్రోద్యమానికీ గ్రంథాలయోద్యమానికీ తీరని అపకారము చేసింది. ఆంధ్ర గ్రంథాలయాలంటే రాజద్రోహకర సంస్థలన్నది. ప్రజావిద్యామహాసభను నిరోధించవలెనంది. ఈవిధంగా నిర్బంధవిధానం విలయనృత్యము చేసింది.

ఆంధ్రోద్యమ స్వరూపంమార్చి ఆంధ్రమహాసభ స్వరూపం ఇచ్చారు. ప్రతియేటా ఒక అధ్యక్షుడు రావటంమూలంగా విధానాలు మారుతూవచ్చినవి. ప్రతాపరెడ్డి, బూర్గుల రామకృష్ణారావు, హనుమంతరావుగార్లుతప్ప మిగతావారికి గ్రంథాలయోద్యమాభిలాష తక్కు-

వగావుండటంవల్ల ఈఉద్యమం తగినంత ప్రాముఖ్యతకు రాలేదు. ఆంధ్ర మహాసభ నిర్మాణకార్యక్రమపంథానుండి రాజకీయోద్యమంవైపుతూగి ఆందోళనాకార్యక్రమం అవలంబిస్తూవుండటంవల్ల, దానిఆధ్వర్యంలో గ్రంథాలయోద్యమం వృద్ధిచెందేదశ దాటింది.

రానున్నస్థితిని గమనించే 1337 ఫసలీలో శ్రీ హనుమంత రావుగారు కేంద్రసంఘంలో గ్రంథాలయశాఖాకార్యదర్శిని వేరే నియ మింపచేశారు. కాని ఆశాఖ పనిచేయలేదు. హనుమంతరావుగారు తిరిగి సాధారణశాఖాపక్షముననే ఈపని చేసేవారు.

1337 ఫసలీతర్వాత మూడవ గ్రంథాలయ మహాసభను రామకోటేశ్వరరావుగారు వరంగల్లుకు ఆహ్వానించారుగాని జరుపలేదు. తర్వాత కొలనుపాకలో రఘునాథరావుగారు కాబోలు కొంతప్రయత్నం జరిపారు. కాని కాలేదు.

నిజామాబాదులో జరిగిన ఆరవ ఆంధ్రమహాసభలో శ్రీ ఇల్లిందల సీతారామారావు, ఖండవల్లి లక్ష్మీరంజనంగార్లు నిజాంరాష్ట్రాంధ్ర గ్రంథాలయ ప్రత్యేకసంఘాన్ని స్థాపించారు. అదేమీ పనిని నిర్వ హించలేదు. ఈవిధంగా కొన్నియత్నాలు జరిగినా 1930-40 వరకు స్వల్పసంఖ్యలో కొన్ని గ్రంథాలయములుతప్ప గ్రంథాలయోద్యమ చరిత్ర ప్రకాశవంతంగా లేదు.

1938 స్టేటుకాంగ్రెసు సత్యాగ్రహం, వందేమాతరం ఉద్యమం మొదలుకావటంతో ప్రజాసేవారంగంలో కొంతమార్పువచ్చింది. కొందరు అధికకాలాన్ని ఇచ్చే ప్రజాసేవకులు బయలుదేరారు. ప్రజాఉద్యమాల ఎడ శ్రద్ధ హెచ్చింది. ఆంధ్రమహాసభ రాజకీయకక్షులకు ఆలవాలమైంది.

నిజాంరాష్ట్రాంధ్ర సారస్వత పరిషత్తు 1942 వ సం॥లో స్థాపించి భాషావిషయంలో కృషి చేస్తున్నారు. హైదరాబాదు నుండి రెండు తెలుగు దినపత్రికలు వెలువడటం ప్రారంభమైంది. ఇన్నాళ్ల కృషి ఫలి తంగా ప్రజానీకంలో జాగృతి కల్గటం కంటికి కన్పడుచున్నది.

1942 వ సం. తర్వాత తిరిగి గ్రంథాలయాల వార్షికోత్సవములు, నూతన గ్రంథాలయాల స్థాపన మొదలైన వార్తలు కన్పిస్తున్నవి.

గ్రంథాలయాల విషయంలో ఇప్పుడిప్పుడే నిర్బంధాలు తొలగుచున్నవి. మొన్నమొన్ననే బి.కురు వెంకటశేషయ్యగారివంటి వారి అధ్యక్షతను జన్గామ యువజన గ్రంథాలయ వార్షికోత్సవాన్ని ఆపిన దృశ్యాలు, ప్రభుత్వాజ్ఞలేదనే పోలీసు చిన్నఅధికార్ల బెదిరింపులూ కొన్ని కన్పించకపోవు. అయినా పూర్వంతో పోల్చిచూస్తే ఇవిఅంతగా లెక్కించవలసినవి కావు. ప్రజాసేవకులుకూడ కొంత పూర్వంకన్న గట్టిపడ్డారు.

౨౫ వ ఆంధ్రదేశ గ్రంథాలయమహాసభ సింగరేణికాలరీస్‌లో జరగటం ఒక అపూర్వవిషయం. "గ్రంథాలయం స్థాపించబడింది. నిద్రావస్థలోనున్నది. పునరుద్ధరింపబడింది" అనువార్తలు పత్రికలో ప్రకటించుట వంటివిగాక నిజంగా ప్రజలను నిద్రావస్థనుండి మేల్కొల్పు గ్రంథాలయాలు నెలకొల్పవలసి యున్నది.

గ్రంథాలయసేవకులకు శిక్షణ, గ్రంథాలయాలకు సలహాలు, కొత్త గ్రంథాలయాలకు ప్రోత్సాహం ఇవ్వటానికి ఆంధ్రదేశ గ్రంథాలయసంఘం పూనుకోవలెను.

మనంకూడా గ్రంథాలయాలకై మఖలోపుట్టి పుబ్బలోపోయే మరొకసంస్థను నెలకొల్పక, ఆంధ్రదేశగ్రంథాలయ సంఘానికే మన గ్రంథాలయాలను అనుబంధింపజేసి దానితోనే పనిని తీసుకోవచ్చును. అవసరమైన ఆం. దే. గ్రం. సంఘపు శాఖా కార్యాలయాన్ని మన ప్రాంతంలోనూ ఒకదానిని స్థాపించుకోవచ్చు. ఈవిధంగా మనం కొంత యత్నిస్తే గ్రంథాలయోద్యమానికి నూతనోత్తేజం కల్గుతుంది.

మొత్తంమీద శుభ భవిష్యత్తు, ఆశారేఖలు కన్పిస్తున్నవి.

వయోజనవిద్యాశాఖా సమావేశము

అధ్యక్షులు

శ్రీ గోపరాజు రామచంద్రరావుగారు

కార్యదర్శి

శ్రీ కోదాటి నారాయణరావుగారు



శ్రీ గోపరాజు రామచంద్రరావుగారు

పుట ౪౯

# వయోజనవిద్య: నా అనుభవములు

క్రొపాటి వెంకటసుబ్బారావు
నిర్మాణకార్యక్రమ ప్రచారకుడు (గూడూరు, నైజామ్)

1945 ఫిబ్రవరి నెలలో వినయాశ్రమములో నిర్మాణ కార్యక్రమ శిక్షణ శిబిరములో శిక్షణ పొందితిని. వెంటనే శ్రీగాడిచర్ల హరిసర్వోత్తమరావు పంతులుగారి యాజమాన్యమున మే నెలలో రేవేంద్రపాడులో నడుపబడిన గ్రంథాలయ శిక్షణ శిబిరములో ప్రవేశించితిని. శిక్షణకాలములోనుండే రేవేంద్రపాడునకు దగ్గరలోనున్న శృంగారపురము గ్రామములో శ్రీవారి ప్రోద్బలముపై రాత్రి పాఠశాలను ప్రారంభించి జయప్రదముగా నడిపితిని. తదుపరి వినయాశ్రమములో శ్రీగొల్లపూడి సీతారామశాస్త్రిగారి ఆజ్ఞప్రకారము కావూరు గ్రామ హరిజనవాడలో రాత్రి పాఠశాలను స్థాపించి షుమారు రెండుమాసములు సాగించితిని. తదుపరి ఖమ్మం నాయకాగ్రేసరులగు శ్రీకోదాటి నారాయణరావుగారి ఆదేశానుసారము నైజాంలో గూడూరు అను గ్రామమున నిర్మాణ కార్యక్రమమును ప్రారంభించి రాత్రి పాఠశాలను కూడ నడుపుచున్నాను. చాలా అభివృద్ధిలో నున్నది.

## గ్రహించిన విషయములు

1. విద్యార్థులకు అక్షరబోధకుముందు, సున్నా, అరసున్నా, బోర్లించిన అరసున్నా, తలకట్టు, రెండూకలిపి వ్రాసిన అరసున్నలు, వీటి పరిచయమును బాగుగా అనుభవపరచవలెను. తదుపరి అక్షరమును బోధించునప్పుడు దానియొక్క ఆకారవిషయమై అనగా ఎట్లువ్రాసిన అక్షరమేర్పడునో ప్రాక్టికల్‌గా పలకమీదవ్రాస్తూ అతనికి బోధించినచో ఆ అక్షరము అతనిమనస్సులో ధృఢముగా నాటుకొనిపోవును.

ఉదాహరణ:— బోర్లించిన అరసున్నావ్రాసి నెత్తిమీద తలకట్టుయిస్తే 'గ' అగును. అట్లే, పెద్దసున్నాపెట్టి నెత్తిమీద తలకట్టుయిస్తే 'ర' అగును. అని పలకమీద వ్రాసినచో విద్యార్థిత్వరలో ఆ అక్షరమును గ్రహింపగలడు. ఇట్లే ప్రతిఅక్షరము చెప్పవచ్చును.

2. ఒక అక్షరము వ్రాసినతర్వాత, ఆ అక్షరము ఫలానాయని చెప్పుతూ, ఆ అక్షరముతోనే తయారగు, అతనికి వాడుకలోనుండు ఒక మాటను జ్ఞప్తికి తేవలెను. ఆమాటయొక్క మొదటిఅక్షరమే తాను నేర్చుకొనబోవు అక్షరముగా గ్రహింపచేయవలెను అట్లుబోధించినచో త్వరలో ఆ అక్షరము ఆతనిమనస్సు నాకర్షింపగలదు.

ఉదాహరణ:— 'క' అనేఅక్షరమును బోధించునప్పుడు కడియము అనేమాటగానీ, వస్తువుగానీ చూపినచో ఆమొదటి అక్షరము అతనిమనస్సు నాకర్షింపగలదు.

3. సాధారణంగా వయోజన విద్యార్థులందరూ వ్యవసాయకులుగానున్నా, కూలీలుగానున్నా, పసుల కాపరులుగానున్నా వుంటారు. విద్యాబోధప్రారంభములో పుస్తకముల నుపయోగించక, కరపత్రముల నమలు జరిపితే చాలా బాగుంటుంది. ఎందువల్లననగా: వారివారి పనులకు వెళ్ళినచోట్లకు పుస్తకములనైతే తీసుకొనిపోవుటకు వీలుండదు. కరపత్రమునైతే జేబులో పెట్టుకొని వెళ్ళవచ్చును. ప్రారంభములో అపేక్ష జాస్తిగా వుండేకారణమున ఆ కరపత్రమును గాఢముగా ఆలోకించును అదిగాక విద్యాగ్రహణ ప్రారంభదుగాన పుస్తకములను ఎక్కువ మూల్యమునిచ్చి గ్రహించుటకు వెరచును. కరపత్రమైనచో మూల్యము చాలా తక్కువగా నుండునుగనుక సులభముగ కొనగలడు. కరపత్రము 1/8 క్రౌను సైజులో నుండవలెను. (ఈవిషయమై నేను అనుభవములో మంచిఫలితమునుపొంది వ్రాయడమైనది) ఈకరపత్రముద్వారా అచ్చులోని 'అ' యున్నూ, హల్లులు పూర్తిగానూ వీటిమీద తయారగు రెండు, మూడు, నాలుగు అక్షరముల మాటలను నేర్పుటకు వీలగును. మిగిలిన అచ్చు అక్షరములను గుణింతము నేర్పునప్పుడు నేర్పిన బాగుండును.

# కరవత్రము నమూనా

| | | |
|---|---|---|
| అ | న | ష |
| క | ప | స |
| గ | బ | హ |
| చ | మ | క్ష |
| జ | య | |
| ట | ర | |
| త | ల | |
| ద | వ | |
| | శ | |

| | | | | | |
|---|---|---|---|---|---|
| క | ఖ | గ | ఘ | ఙ | |
| చ | ఛ | జ | ఝ | ఞ | |
| ట | ఠ | డ | ఢ | ణ | |
| త | థ | ద | ధ | న | |
| ప | ఫ | బ | భ | మ | |
| య | ర | ఱ | ల | ళ | |
| వ | శ | ష | స | హ | క్ష |

| | | |
|---|---|---|
| అల | పగ | అంగ |
| అర | పస | అండ |
| అన | బస | అంత |
| కల | మర | గంప |
| గడ | రవ | గంగ |
| జడ | లత | గంత |
| తల | వల | దండ |
| దడ | శగ | వంద |
| నగ | క్షయ | సంత |

| | | |
|---|---|---|
| అరక | తరక | శనగ |
| అలక | తబల | ఆంగన |
| ఆరవ | దవడ | వంకర |
| కలక | నలక | దండన |
| కలప | పలక | సంపద |
| కలవ | పడవ | అలమర |
| గడప | పనస | మరతల |
| గడన | మడత | తడపర |
| చలమ | రవలు | పడమర |
| జలగ | వరద | అవతల |
| | సవర | కమదయ |

కరపత్రమునం దుదహరించిన ప్రకారము ముందు తేలిక అక్షరములు, తదుపరి వరుసగా వత్తులుగల అక్షరములు నేర్పవలెను. మొత్తము ఆ కరపత్రమును 15 దినముల లోపలనే చదువనూ వ్రాయనూ నేర్పవచ్చును. తదుపరి అచ్చుఅక్షరములు నేర్పుతూ గుణింతములు నేర్పవలెను.

4. ద్విత్వాక్షరములు బోధించిన తరువాత ప్రారంభ విద్యార్థుల కొరకు పెద్దపెద్ద అక్షరములతో సులభశైలిలో పది పేజీలకు ఎక్కువ లేకుండా వ్రాయబడిన చిన్నచిన్న కథలుగానీ, చరిత్రలుగానీ, ప్రబోధములుగానీ అవసరము. నేను శృంగారపురములో యీక్రింద కనుపరచిన పుస్తకములను పెద్ద పెద్ద అక్షరములతో సరళశైలిలో లిఖించి విద్యార్థుల కందజేసితిని.

1. ప్రతాగుడు
2. ధ్రువుడు
3 నారదుడు
4. చిత్రకేతుడు
5. మార్కండేయుడు
6. ప్రహ్లాదుడు

మానవజీవిత రంగంలో మిన్నయగు యీవిద్యాబోధకు ప్రబోధపరచి ప్రజాసేవకు అవకాశము కలుగచేసిన శ్రీగాడిచర్ల హరిసర్వోత్తమరావు పంతులుగారి కెంతయు కృతజ్ఞుణ్ణి.

## నిర్వహణశాఖా సమావేశము

అధ్యక్షులు

శ్రీ పాతూరి నాగభూషణంగారు

కార్యదర్శి

శ్రీ కొమర్రాజు సత్యనారాయణరావుగారు



శ్రీ పాతూరి నాగభూషణంగారు

పుట ౫౩

# ఆచూకీసేవ

శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు, ఎం. ఏ.
ఆం. దే. గ్రం. సంఘాధ్యక్షులు

గ్రంథాలయ సేవకు సంబంధించిన శాఖలలో నవీనాతి నవీనము ఆచూకీసేవ. పూర్వము దీనినిగురించిన ప్రసక్తియే వుండేదికాదు. గ్రంథాలు సమకూర్చిపెట్టటం, అడిగినవారికి వాటిని ఎరువీయటం యీ రెండుకార్యాలతో గ్రంథాలయసేవ ముగిసిపోతుండేది. కాని క్రమక్రమంగా గ్రంథాలయశాస్త్రము అభివృద్ధి అయినకొద్దీ ఆచూకీకి సంబంధించిన వ్యవహారాలు పెరిగిపోయి యీదినము నిజముగా ఈశాఖ లేకపోతే గ్రంథాలయసేవయే లేదన్నేస్థితి కలిగివున్నది. సరియైన చదువరికి సరియైన గ్రంథమును, సరియైనకాలమున సరియైన పద్ధతిని అందజేయుటం ఈ శాఖలోని పరమోద్దేశం. ఇచ్చట గ్రంథమంటే యేమో అర్థము చేసుకోతగియున్నది. నూర్లకొలది పుటలూ, కుట్లూ, బైండింగువున్న వే గ్రంథములని భ్రమపడకూడదు. చిరుపొత్తములూ, కరపత్రములూ, దిన, వార, పక్ష, మాస, త్రైమాసిక, వార్షికప్రచురణములూ అన్నీ గ్రంథములే. చదువరి కోరేవిషయము ఇందులో ఎక్కడ దొరకునో ఆచూకీపట్టి అతనికి అందచేయుటంలో మహోత్తమమైనసేవ గ్రంథాలయ నిర్వాహకునికి లభించుతున్నదనటం గుర్తింపదగును. ఈసేవకు సంబంధించి క్రింద చెప్పబోయే వుపశాఖలు గ్రంథాలయశాస్త్ర వివరణములో అంగీకృతములై వున్నవి. అన్నిగ్రంథాలయాలకూ, ఈ అన్ని ఉపశాఖలలోనూ ప్రమేయంవుంటుందని యెవరూ భ్రమపడకూడదు. ఆయాసందర్భానుసారంగా ప్రతిగ్రంథాలయమున్నూ తనకు అన్వయించే ఉపశాఖల కార్యక్రమాన్ని అమలులో పెట్టుకోవలెను. చాల గొప్ప గ్రంథాలయాలలో అనుభవాలు పొందినవారు సవిమర్శగా ఆలోచించి యీ వుపశాఖలక్రింద విషయ వివరణము చేసినారనటం గమనించ దగును.

## తాత్కాలిక గ్రంథశ్రేణి నిర్మాణము

వేలకొలది గ్రంథములుండి నూర్లకొలది చదువరులు వచ్చే గ్రంథాలయాలలో చదువుకోటానికి గ్రంథములు తీసుకొనినవారు ఒక్కరు ఐదునిమిషాలలో, యింకొకరు ఒకగంటలో, మరియొకరు రెండుగంటలలో యిట్లా పుస్తకాలు చదివి చదివినచోట వదలిపోతారు. వాటిని అప్పటికప్పుడు ఒకనొకరు తెచ్చి కుప్పగా పెట్టిపోతాడు. వాటిని వెంటనే వర్గీకరించి తాత్కాలికంగా శ్రేణి యేర్పరిస్తే ఆపుస్తకాలే ఆదినమే ఆగంటలోనే అడిగేచదువరులకు అందివ్వటం సులభమవుతుంది. వారే వచ్చి యేర్పడిన శ్రేణిలోనుంచి తీసుకొని చదువుకోవటం సులభతరమవుతుంది. కాబట్టి ఈచిన్న ఆచూకీకార్యము యెంతో ప్రయోజనకారి అవుతుంది.

## చదువరులకు త్రోవవేసి యిచ్చుట

గ్రంథాలయములోనికి వచ్చే చదువరికి ఏవిషయమును గురించిన పుస్తకాలు ఎక్కడ వున్నవో తెలియుట కష్టము. అంతేకాక అతని మనస్సులో యేసంగతి తెలిసికొనవలెనని వచ్చినాడో ఆసంగతి వ్రేలుపెట్టి తెలుసుకోవటం అందరికీ సాధ్యంకాదు. అనుభవములేని చదువరిని గ్రంథాలయంలో అట్టే వదిలిపెట్టితే అతనికి కాలహరణము అవ్వేది ఒకటేకాక గ్రంథాలనుకూడా తనకు తెలియక తారుమారుచేయటం చేత గ్రంథాలయ నిర్వాహకునికి యెడతెగని కష్టము కలుగవచ్చును. కాబట్టి చదువరి కొత్తవాడు కనిపిస్తే ఆచూకీ శాఖలోని వుద్యోగి అతనికి తగిన సహాయం చేయటానికి సిద్ధపడవలెను. కొందరు చదువరులు విచిత్ర ప్రకృతి కలవారుంటారు. ఇట్టి సహాయం కోరడం అంటే వారికి మర్యాదలోపంగాకూడా కనిపిస్తుంది. అందుచేత వారిని కనుక్కోవటంలో గ్రంథాలయోద్యోగి చాలా జాగ్రత్తగా అట్టివారి విశ్వాసాన్నికూడా సంపాదించేవిధంగా ప్రవర్తించవలసి వుంటుంది. వారుకోరేది ఏమిటో కనుక్కొని వారిని పుస్తకాలదగ్గరికి తీసుకొనివెళ్లుతూ వారి మనస్తత్వం కనిపెట్టి సలహాలచేస్తూ తోడ్పడవలెను.

## జాగ్రత్త

పుస్తకా ఉపయోగించే చదువరులలో అందరూ నిష్కల్మష ప్రవర్తకులై వుండరు. కొందరు గ్రంథములోని బొమ్మలూ, కొన్ని కొన్ని భాగాలు సంగ్రహించే ప్రయత్నంకూడా చేసేవారుంటారు. చిన్న చిన్న పుస్తకాలైతే తస్కరంకూడా చేస్తారు. ఇట్టివారిని జాగ్రత్తగా చూచు కోవటం ఆచూకీ కార్యక్రమంలో ఒకభాగం. అంటే గ్రంథసామగ్రి యెల్లరకూ వినియోగపడటానికి విఘాతము కలుగజేసే అన్ని ఘట్టాలనూ వీరు కనిపెట్టివుండవలెనన్నమాట.

ఈ పైనచెప్పిన మూడు విషయాలూ స్వేచ్ఛోపలబ్ధి పద్ధతిమీద నడచే పెద్దపెద్ద గ్రంథాలయాలకు చాలా బాగా అన్వయమగును.

## తక్షణ ఆచూకీ

కొందరు చదువరులు కోరేవిషయాలకు అక్కడనే, యెదుటనే జవాబిచ్చుటకు అవకాశం వుంటుంది. ఏ నిఘంటువునో, ఏ విజ్ఞాన సర్వస్వమునో, ఏ గజెటీరునో, మరియే యితరమైన పుస్తకసామగ్రినో వెంటనే చూచుకొండని తమ గ్రంథాలయంలో వున్నంతవరకు చూపించటం ఈ కార్యక్రమంలో చేరును. నిఘంటువులూ, విజ్ఞానసర్వస్వాలూ, వార్షిక సంచికలూ, ఇట్టివాటిలో దొరికే భోగట్టా ఈ బాపతులో చేరును.

## దీర్ఘకాలపు ఆచూకీ

కొన్ని విషయాలలో కొంతకాలము పరిశ్రమ చేస్తేనేగాని గ్రంథాలయోద్యోగి చదువరికి కావలసిన సహాయమును చేయలేడు. కొన్ని సందర్భములలో యిట్టి సహాయము చేయుటకు నెలలూ, ఏండ్లూ పట్టవచ్చును దీనికి కారణము మరియేమీకాదు. తనవద్ద విషయ వివరణకు తగిన పరికరాలు లేనప్పుడు యితడు పరిశోధనకు పూనుకోవలసి వచ్చును. అకారాది సూచీలు, గ్రంథముల పట్టికలు వగైరాల పర్యావలోకనము మాత్రమేకాక, తన దేశములోని గ్రంథాలయాలతోను, విదేశాలలోని గ్రంథాలయాలతోను ఉత్తరప్రత్యుత్తరాలు జరుపవలసిన ఆవశ్యకముకూడా కలగవచ్చును. అంటే గ్రంథా

లయసేవ నేటిదినము ప్రపంచ విస్తృతమై వున్నదని గుర్తించి ఆ యభివృద్ధి ప్రయోజనాన్ని తనదగ్గరకు చేరిన చదువరికి అందచేయుటకు యీ వుద్యోగి ప్రయత్నించవలసి యుంటుందన్నమాట. ఈ సేవను నేను ప్రత్యేకప్రతిభతో కూడినసేవగా పరిగణించుచున్నాను. గ్రంథాలయ నిర్వాహకులు తమగ్రంథాలయములో పుస్తకసంఖ్య కొద్దియని, తమకు ఉపపత్తిలేదని, ఆధారములేదని వాపోవుచుండటం మనకు విశదమే. ఇట్టి వారుయీదీర్ఘ కాలపు అమూల్యవిధానంలో ఉండేసహాయాన్ని గ్రహించ లేదన్నమాట.

తమ వూళ్లలో వుండే స్వల్పసంఖ్యాక గ్రంథాలయాలతో స్నేహసంబంధములు పెట్టుకొని, వారి పుస్తకముల జాబితాలు నకళ్లు చేసి వశమునందుంచుకొని, తమవద్ద లేని సామగ్రిని తమగ్రామంలోని యితర గ్రంథాలయములనుండి తెప్పించియిచ్చే సేవ ఈవిధానములో మొదటిమెట్టు. తమ ప్రాంతంలోని కేంద్ర గ్రంథాలయమేదో తెలుసుకొని, అక్కడిసామగ్రి స్వభావమునెరిగి, ఆగ్రంథాలయపు పుస్తకములజాబితాను సేకరించి, అక్కడనుంచి చదువరికి కావలసిన సామాగ్రిని తెప్పించి యివ్వుట తరువాతిమెట్టు * అచ్చటకూడా దొరకని పుస్తకములగురించి యెంతదూరమైన గ్రంథాలయానికైనా (ఉదాహరణార్థము అమెరికాలోని విశ్వవిద్యాలయ గ్రంథాలయాలకు) ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపించి భోగట్టా సంపాదించటం అన్నిటికంటే పై మెట్టు.

పరంపరగా యేర్పడునట్టి యిట్టి సంబంధ బాంధవ్యము నేడు గ్రంథాలయసేవలో మహోపకారముగా యేర్పడుతున్నది. గ్రంథాలయోద్యోగి ఈసంగతి తెలిసికొన్న మాత్రమున చాలదు. ఎల్లప్పుడూ లఈవిరాలను గురించి చదువుట, ఆలోచించుట గ్రంథాలయోద్యోగి ధర్మం. తన గ్రంథాలయంలో వుద్యోగపీఠమువద్ద కూర్చున్నప్పుడు

* ఆంధ్ర దేశమునకు సంబంధించినంతవరకు వేటపాలెములో కీర్తిశేషులైన శ్రీ ఊటుకూరి సుబ్బరాయశ్రేష్ఠి వదాన్యతచేత స్థాపింపబడిన సారస్వతనికేతనమును తెలుగుసీమ కంతటికిని కేంద్ర గ్రంథాలయముగా ఉపకరించడానికి నిశ్చయించుకొన్నారు. గ్రంథమెక్కడా దొరకకపోతే వారు ప్రత్యేకంగా కొనియైనా సరఫరా చేయడానికి సిద్ధముగ నున్నారు.

వేరే పనిచేయకుండావుండే ప్రతినిమిషమును వ్యర్థపుచ్చక గ్రంథముల జాబితాను అవలోకించుచూ పూర్ణపరిచయము సంపాదించ వలెను. అంతేకాక తన గ్రంథాలయంలో వుండే అన్ని గ్రంథముల పరిచయ మును చేసుకొనవలెను. ఈవిధమైన పరిశ్రమ చేసినప్పుడే తాను చదువరి కాలమును వృథపుచ్చక, వెతుకుటలో తన కాలమును వృథ చేసుకొనక చదువరి ప్రశ్నించగానే ఆప్రశ్నకు సమాధానము చెప్పగల తయ్యారీ పొందగలడు. ఈవిధమైన తయ్యారీ పొందుటను గ్రంథాలయ శాస్త్రమున ప్రత్యేకధర్మముగా పరిగణించుచున్నారు.

ఇంతేకాదు. తాను ఈపరిశ్రమ చేసేటప్పుడు ఏదైనా క్రొత్త విషయము స్ఫురిస్తే దానిని ఒక చీటిమీద వ్రాసియుంచటం. యిటు వంటి చీటీలు పేరకుండా ఎప్పటికప్పుడు వీటిని విషయాన్నిబట్టి వర్గీక రించి పెట్టుకోవటం, వీటికి వర్గీకరణపు కార్డులు వేరుగా వ్రాసియుం చటం చేసుకొనుచూ రావలెను. వీటిని గ్రంథాలయపు వర్గీకరణపు పెట్టెలలో చేర్చవలెను. కొన్నిమాసముల కొక పర్యాయము పెట్టె లోని కార్డులన్నిటినీ పునర్విమర్శించుకొంటూ యుండవలెను. అందులో తీసివేయవలసినవి యుంటే తీసివేస్తూయుండవలెను.

ఈవిధానము కార్డుల ఇండెక్సింగు యేర్పడి యుండేచోట అన్వ యమవుతుంది అటువంటిదికాక కేటలాగు పుస్తకరూపంగా యుంచిన చోట వ్రాసుకొన్న చీటీలను విషయానుగుణంగా వేరేవేరే ఫైలుపుస్త కాలల్లో అతికించడమో లేక వేరేవేరే పుస్తకాలల్లో నకలు వ్రాయ డమో జరుపుకోవచ్చును. ఈపుస్తకాలను బట్టి కేటలాగుతోకూడ వీలున్నమార్పులను చేసికొనవచ్చును.

ఎట్లైనా గ్రంథాలయోద్యోగి నిరంతరము విషయవిజ్ఞానము సంపాదించడానికి పాటుపడుతూ యుండవలెనని అనడం, చదువరులతో సన్నిహిత సంబంధము పెట్టుకొని వారికి విశ్వాసపాత్రుడు కావడం అవ సరమైన సందర్భాలలో దగ్గర దూరపుగ్రంథాలయాలతో ఉత్తరప్ర త్యుత్తరాలు కూడ జరపడం, ఈ ఆమూకీ సేవావిధానములో ప్రధాన సూత్రము.

మదికుదురజేసి చల్లని మాటజెప్పి
కలక నెడలించి ధైర్యంబు గలుగజేసి
తల్లితండ్రులబోలి పెద్దలను బోలి
సదుపదేశంబు జేయు బుస్తకమె నీకు.

మించు విజ్ఞానజలధి దేలించునావ
మంచిచెడ్డల గతులేర్పరించు త్రోవ
మానసిక రోగములనెల్ల మాన్పుమందు
పొగడదగువిందు నీకెందు బుస్తకంబె.

# ౧. ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభల నిబంధనలు

౧. (అ) ముందుజరిగిన మహాసభ వారి తీర్మానము ననుసరించి గాని, ఆంధ్రదేశ గ్రంథాలయసంఘ పాలకవర్గము వారి తీర్మానము ననుసరించిగాని ఇది ఆంధ్రదేశములో ఏటేట ఒకజిల్లా లేక ప్రాంతములో జరుగును.

(ఆ) దీనికాలనిర్ణయమును ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘపాలకవర్గము వారి యనుమతితో ఆహ్వానసంఘమువారు చేయుదురు.

## ఆహ్వానసంఘము

౨. మహాసభనిర్వహణ నిమిత్తమిది జరుగు ప్రదేశము చుట్టుపట్టులను, జిల్లాలోనుగల గ్రంథాలయోద్యమాభిమానులు లాహ్వానసంఘముగ నేర్పడి, వీరు తమలోనుండి యొకకార్యవర్గము నేర్పరచుకొందురు. ఒక అధ్యక్షుడు, ఒక కార్యదర్శికితోడు స్థానికావసరములనుబట్టి ఉపాధ్యక్షులను, సహాయ లేక సంయుక్తకార్యదర్శులనూ, కోశాధిపతిని వీరెన్నుకొనవచ్చును. కార్యభారమును పంచుకొను ఉపసంఘములను కూడా ప్రత్యేకము నియమించవచ్చును.

3. ఆహ్వానసంఘ సభ్యులు రుసుములను నిర్ణయించుట, ఆంధ్రదేశ గ్రంథాలయసంఘ పాలకవర్గము వారు సూచించుపేర్లనుండి మహాసభాధ్యక్ష ప్రారంభకుల నెన్నుకొనుట, ఆంధ్రదేశ గ్రంథాలయసంఘ పాలకవర్గమువారి సలహాల ననుసరించి మహాసభ కార్యక్రమమును నిర్ణయించినడుపుట, ఆహ్వానసంఘము వారి ముఖ్యవిధులు. ప్రతినిధుల కందరకు ఆహ్వానసంఘమువారు ఉచితభోజనాది వసతుల నేర్పాటు చేయవలెను.

౪. (అ) మహాసభనిమిత్తము వసూలగు ధనములో ఖర్చులుపోను మిగులు మొత్తము నాహ్వానసంఘమువారు ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమున కిచ్చివేయవలెను. ఆదాయమునకు మించిన వ్యయము చేయబడినప్పుడీలోటును ఆహ్వానసంఘమువారే భరించవలెను.

(ఆ) ఆహ్వాన సంఘమువారు మహాసభ లెక్కలను సభపూర్తియైన నెలదినములలోపలనే పంపుచు మిగిలిన ధనమునుకూడా గ్రంథాలయ సంఘమునకు చెల్లించవలెను.

౫. ఆహ్వానసంఘము వారు తమసభ్యులనుండి అధ్యక్షకార్యదర్శులతో చేరి మహాసభకు 10 మంది ప్రతినిధుల నెన్నుకొనవలెను.

## ప్రతినిధులు

౬. మహాసభాధ్యక్ష ప్రారంభకులు, శాఖాసమావేశముల అధ్యక్షులు, ఆంధ్రదేశగ్రంథాలయ సంఘసభ్యులు, ఆంధ్రగ్రంథాలయ పఠనాలయములు, వయోజనవిద్యా ప్రచారసంస్థలు, వయోజనవిద్యా ప్రచారకులు, గ్రంథభాండాగారులు, గ్రంథాలయ శిక్షితులు, ఆహ్వానసంఘమువా రెన్నుకొన్నసభ్యులు మహాసభకు ప్రతినిధులుగా యెంచబడుదురు.

౭. (అ) ప్రతినిధిరుసుము వ్యక్తికిగాని సంస్థకుగాని రు 1-0-0. ఈ మొత్తము ఆంధ్రదేశగ్రంథాలయ సంఘమునకు చెందును.

(ఆ) మహాసభాధ్యక్ష ప్రారంభకులు, శాఖాసమావేశముల అధ్యక్షులు, ఆహ్వానసంఘమువా రెన్నుకొను ప్రతినిధులు, ప్రతినిధి రుసుమును చెల్లించవలసిన విధిలేదు.

వివరణ:— ఆంధ్రదేశగ్రంథాలయ సంఘసభ్యులుగనున్న గ్రంథాలయ పఠనాలయములు, వీనిని నడుపు సంఘములు మహాసభకు ఇద్దరేసి ప్రతినిధుల చొప్పున పంపవచ్చును. అయినను ఈసంస్థలు ప్రతినిధిరుసుము క్రింద రు 1-0-0 కన్న అధికము చెల్లించ నక్కరలేదు.

౮. శాఖాసమావేశములలో జరుగుచర్చలలో పాల్గొనుటకును, తీర్మానముల ప్రతిపాదించుటకును ప్రతినిధులు కానివారికి వీలుండదు. కాని సభవారి అనుమతితో సభాధ్యక్షు లెవరికైన నిట్టియవకాశమును తాత్కాలికముగ నొసగవచ్చును.

# విషయనిర్ణయసభ

౯. మహాసభాధ్యక్ష ప్రారంభకులు, శాఖాసమావేశముల అధ్యక్ష కార్యదర్శులు, ఆంధ్రదేశగ్రంథాలయ సంఘ పాలకవర్గ సభ్యులు, జిల్లా, తాలూకా, నగరగ్రంథాలయ సంఘముల అధ్యక్ష కార్యదర్శులు, ఆహ్వాన సంఘాధ్యక్ష కార్యదర్శులు, ఆంధ్రదేశగ్రంథాలయ సంఘాధ్యక్షులుగాని, వీరు లేనిసమయమున మహాసభాధ్యక్షులుగాని నియమించు 5 గురకు మించని ప్రతినిధులు విషయనిర్ణయ సభాసభ్యులుగ నుందురు.

౧౦. (అ) మహాసభలో ప్రవేశపెట్టవలసిన తీర్మానము లన్నియు ముందుగ విషయనిర్ణయ సభవారి యామోదమును పొందవలెను. కాని శాఖాసమావేశముల చర్చలఫలితముగ బయలుదేరు తీర్మానముల కీనియమము వర్తించదు.

(ఆ) ప్రతినిధులలో 15 మందికి తక్కువగాని వారు వ్రాత మూలకముగ కోరినప్పుడును, ప్రత్యేక సందర్భములలోను, అవసరమని తోచిన తీర్మానములను మహాసభాధ్యక్షుడు నేరుగ మహాసభలో ప్రతిపాదించుట కనుమతింప వచ్చును.

## శాఖ సమావేశములు

౧౧. (అ) మహాసభతోపాటు క్రింది శాఖాసమావేశములు, ప్రదర్శనము ముఖ్యముగా నేర్పాటు చేయబడవలెను.

1. ప్రచారశాఖ
2. నిర్వహణశాఖ
3. వయోజన విద్యాశాఖ

(ఆ) ఒక్కొక్క శాఖాసమావేశమున కొక్కొక్క అధ్యక్షుడు, కార్యదర్శి యుండవలెను. వీరిని ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘ పాలకవర్గము వారెన్నుకొందురు.

౧౨. శాఖాసమావేశములలో చదివి చర్చించవలసిన వ్యాసముల క్రమమును ఆయా శాఖాసమావేశముల అధ్యక్ష కార్యదర్శులు, ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘాధ్యక్ష కార్యదర్శులలో నొకరు లేక వారు నియమించు వారొకరు చేరి నిర్ణయింతురు.

## ౨. ౨౬వ ఆం. దే. గ్రం. మహాసభ ప్రతినిధులు

### ఆహ్వానసంఘ ప్రతినిధులు:

శ్రీ సురవరము రంగారెడ్డి, శ్రీ మూరం నరసింగారెడ్డి, శ్రీ బెక్కెం అయ్యప రెడ్డి, శ్రీ శేరిపల్లి వెంకట్రామరెడ్డి, శ్రీ ఉండవల్లి చిన్నారెడ్డి, శ్రీ తెన్నెపాటి సీతారెడ్డి, శ్రీ శారం వెంకటరెడ్డి, శ్రీ మారామునగాల వెంకటశెట్టి, శ్రీ కరణం వెంకట్రావు, శ్రీ ఆలంపూరు కొండుమళ్ల వీరయ్యగార్లు

### గ్రంథాలయసంఘములు:

విశాఖపట్టణజిల్లా గ్రంథాలయసంఘము శ్రీ మాకేపల్లి రామచంద్రశాస్త్రిగారు

### గ్రంథాలయములు:

| | |
|---|---|
| యువజన గ్రంథాలయం, కొల్లాపురం | శ్రీ సి. ఆర్. శర్మ, వై. సీతారామరావుగార్లు |
| సేవాశ్రమ వాణీమందిరము, వెదపాలెం | శ్రీ పాతూరి నాగభూషణంగారు |
| విజ్ఞాన నికేతనము ఖమ్మంమెట్టు | శ్రీ కోదాటి నారాయణరావు<br>కొమర్రాజు సత్యనారాయణరావుగార్లు |
| విద్యార్థిసంఘము, ఖమ్మంమెట్టు | శ్రీ యల్లాప్రగడ రామమూర్తిగారు |
| శ్రీ మహాత్మాగాంధీ ధర్మపుస్తకభాండాగారము, పటమటలంక. | శ్రీ కొమ్మా సీతారామయ్యగారు |
| శ్రీ దుర్గాపరవమందిరము నూజివీడు | శ్రీ బసవరాజు జగన్నాథరావుగారు |
| శ్రీ వేమనగ్రంథనిలయము, సాలన | శ్రీ కె. యస్. ఆర్. శర్మగారు |
| సర్వజనాంధ్ర గ్రంథాలయం, క్యాతూరు | శ్రీ విరిపాటి సంజీవశర్మ,<br>విరటి లక్ష్మయ్య గార్లు |
| ఆంధ్రవాణీ గ్రంథాలయము, మత్తిల | శ్రీ వట్టెం పాండురంగయ్యగుప్తగారు |
| శారదా గ్రంథాలయము, కంచిరేవుపల్లి | శ్రీ వి. ప్రభాకరరెడ్డి, పి. హనుమంతరెడ్డిగార్లు |
| శారదా గ్రంథాలయము, మామునగాల | శ్రీ జి. చంద్రమౌళీశ్వరశర్మ,<br>జి. నీలకంఠశాస్త్రిగార్లు |

శ్రీ సరస్వతీ గ్రంథాలయము, ముక్కామల, ప. గోదావరి

రెడ్డి రీడింగ్ రూమ్, హైదరాబాదు

శ్రీ రంగనాయకాంబ ఆంధ్రగ్రంథాలయం, తాటిపర్తి, గోపాలపేట సంస్థానం

శ్రీ విశ్వదాత నాగేశ్వరరాయ గ్రంథాలయం, కోటఉరట్ల, విశాఖపట్నంజిల్లా

| | |
|---|---|
| శ్రీ చెన్నకేశ్వర గ్రంథాలయము, లింగన్నాయి | శ్రీ బచ్చు వెంకటేశ్వర్లు,<br>ఇల్లూరి వెంకయ్యగార్లు |

రవీంద్ర గ్రంథాలయము, యాపర్ల — శ్రీ ఉమ్మెత్తల బాలసుబ్బయ్య, కొడిచర్ల సుబ్రహ్మణ్యంగార్లు

ఆర్యవైశ్య యువజన గ్రంథాలయము, మంగళగిరి — శ్రీ వనమా శేషారావుగారు

కళాసమితి గ్రంథాలయం, అమరచింత ఆత్మకూరు సంస్థానం — శ్రీ వి. వెంకటాద్రిమారెడ్డి, ఏ. రామదేవరావుగార్లు

గురునాథ గ్రంథాలయం, కృష్ణాపురం — శ్రీ కోనా ఆదినారాయణ గారు

భారతీ గ్రంథాలయం, వెనగలూరు — శ్రీ కోవూరు వీరభద్రరావు గారు

సరసవినోదిని గ్రంథాలయము, తక్షశిల — శ్రీ డాక్టరు అప్పలాచార్యులు, ఎ. పి. నారాయణరెడ్డి గార్లు

బాలసరస్వతీ గ్రంథాలయం, హైదరాబాదు — శ్రీ బి. శ్రీనివాసరావు గారు

శ్రీ రామకృష్ణ స్మారక గ్రంథాలయం, అలంపూరు — శ్రీ గడియారం రామకృష్ణశర్మగారు

శ్రీ సీతారామాంజనేయ గ్రంథాలయం, మహబూబునగరు — శ్రీ. పి. చెన్నకేశవులు గారు

సరస్వతీవిలాస గ్రంథాలయం, ఉండవల్లి — శ్రీ దుంపల రామిరెడ్డిగారు

మునిసిపల్ లైబ్రరీ, కర్నూలు — గ్రంథభాండాగారి.

శ్రీ లక్ష్మీగణపతి గ్రంథాలయం, పలంత్రిఅగ్రహారం — సోమయాజుల వెంకట సీతారామయ్య భుక్తగారు

శ్రీ హట్టి కృష్ణశాస్త్రి గ్రంథాలయం, అనంతపురం — శ్రీ హట్టి శంకరరావుగారు

వ్యక్తులు :

శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు, హైదరాబాదు
„ పటంకర నరసింహారావుగారు, మహబూబ్‌నగర్
„ పి. తిరుమల శ్రీనివాసశర్మగారు, అమరచింత, ఆత్మకూరు సంస్థానము
„ గడ్డమీది గంగాధరంగారు, కొల్లాపురం
„ అర్చకం రంగాచార్యులుగారు, క్యాతూరు
„ చేగిరెడ్డి బాలిరెడ్డిగారు, కంభం
„ బి. రామిరెడ్డిగారు, హైదరాబాదు
„ వి. భీమేశ్వరరెడ్డిగారు, గద్వాల
„ అయ్యంకి వెంకటరమణయ్యగారు, బెజవాడ
„ సలంగటం నరసింహారెడ్డిగారు, చింతకుంట
„ మల్లెల బాలకృష్ణారెడ్డిగారు, మదూరు
„ సురవరం రామచంద్రారెడ్డిగారు, ఇటికాలపాడు
„ ఎద్దుల చిన్నారెడ్డిగారు, డిటో
„ ఎద్దుల గుండారెడ్డిగారు, మచ్చింతల
„ లోకనంది శంకరనారాయణగారు, ఆదోని

శ్రీ కాందూరి నరసింహాచార్యులుగారు, హైదరాబాదు
,, జి. వి. ధర్మారెడ్డిగారు, మానవపాడు
,, జి. లక్ష్మారెడ్డిగారు, వనపర్తి
,, కాచర్ల విశ్వనాథంగారు, హైదరాబాదు
,, సురవరం వెంకటరెడ్డిగారు, క్యాతూరు
,, బి. గోవిందరెడ్డిగారు, వనపర్తి
,, యం. నారాయణ రెడ్డిగారు, కొల్లాపురం
,, గోవిందం నరసింహంగారు, గుమ్మడం
,, భావరాజు సుబ్బరామయ్యగారు, బ్రాహ్మణకొట్కూరు
,, దామోదర రెడ్డిగారు, తిరుమలాపురం
,, యం. బాలిరెడ్డిగారు, దుంపల్లి
,, బిదురు వెంకటశేషయ్యగారు, హైదరాబాదు
,, నాగినేని వెంకయ్యగారు, ధేనువుకొండ, ఒంగోలుతాలూకా
,, లంకిరెడ్డి రాఘవరెడ్డిగారు, వల్లభాపురం, తెనాలితాలూకా

## 3. ౨౮వ ఆం. దే. గ్రం. మహాసభలో వసూలైన విరాళములు

| | రు |
|---|---|
| శ్రీ రాజాబహద్దరు వెంకట్రామారెడ్డిగారు, హైదరాబాదు | 100హా |
| ,, సురవరం రంగారెడ్డిగారు, క్యాతూరు | 50 |
| ,, నారాయణస్వామిగారు, కొల్లాపురం | 20 |
| ,, అయ్యంకి వెంకటరమణయ్యగారు, బెజవాడ | 10 |
| ,, వడ్డెమాను చినయల్లారెడ్డిగారు | 7 |
| ,, పల్లా తిప్పారెడ్డిగారు, క్యాతూరు | 5 |
| ,, ఎద్దుల పుల్లారెడ్డిగారు, యావలదేవిపాడు | 5 |
| ,, జలసం వెంకటస్వామిగారు, ఉండవల్లి | 5 |
| ,, మహమ్మద్ గాజీగారు, మహబూబ్‌నగర్ | 2 |
| ,, వి. వెంకట్రామారెడ్డిగారు, ఆత్మకూరు | 2హా |
| ,, కరణం వెంకట్రావుగారు, లంగనాపాయి | 2 |
| ,, వల్లెపాడు రామకృష్ణయ్యగారు | 2 |

| | |
|---|---|
| శ్రీ పుల్లయ్యగారు, కురుకుళ్ళ | 2 |
| ,, నారాయణరెడ్డిగారు, కొత్వాలీపటేలు, ఆముదాలపాడు | 2 |
| ,, వల్లా శంకరరెడ్డిగారు, నాగులపల్లి | 2 |
| ,, వట్టెం పాండురంగయ్యగుప్తగారు, మక్తల | 2 |
| ,, కునాపురం నరసింహారెడ్డిగారు, తక్కశిల | 2 |
| ,, ఎం. చెన్నకేశవులుగారు, మహబూబ్ నగర్ | 2 |
| ,, బి. శ్రీనివాసరావుగారు, అలంపూరు | 1 |
| ,, జి. ధర్మారెడ్డిగారు | 1 హా |
| ,, గోవిందరెడ్డిగారు | 1 హా |
| ,, ధర్మారెడ్డిగారు | 1 |
| ,, విశ్వనాథంగారు | 1 హా |
| ,, కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారు, వనపర్తి | 1 |
| ,, చిక్కా నారాయణరెడ్డిగారు | 1 |
| ,, తాటిపర్తి అనంతాచార్యులుగారు, గోపాలపేటసంస్థానం | 1 హా |
| ,, కర్ణాటక శాయమ్మగారు, క్యాతూరు | 1 |
| ,, వలెపాదల లక్ష్మీనారాయణగారు | 1 |
| ,, బత్తుల శివయ్యగారు | 1 |
| ,, బెక్కల బలిశంగారు, హరిసింగుగారు | 1 |
| శ్రీమతి చంద్రమ్మగారు, క్యాతూరు | 1 |
| ,, గావిరెడ్డి లక్ష్మమ్మగారు, ,, | 1 |
| ,, ,, చిన్నమ్మగారు ,, | 1 |
| ,, భీమవరం నాగమ్మగారు | 1 |
| ,, చిన్నమారు చిన్నమ్మగారు | 1 |
| ,, వల్లెపాటి పుల్లమ్మగారు | 1 |
| ,, బోయ పుల్లమ్మగారు | 1 |

'హా' అనే అక్షరం ప్రక్కన వ్రాసినవి హాలీరూపాయలు. తక్కినవి కల్దారు రూపాయిలు అనగా బ్రిటీషు నాణెములు.

## ౪. ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము, బెజవాడ

## నిర్మాణ నిబంధనలు

(1860 వ సం॥ 21 వ ఆక్టునుసరించి రిజిష్టరు చేయబడినది)

## సంకల్పపత్రము

(Memorandum of Association)

1. ఈసంఘము పేరు:

"ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము - బెజవాడ"

II. ఉద్దేశములు:

౧. ఆంధ్రదేశమున ధర్మగ్రంథాలయోద్యమము నభివృద్ధిచేయుట, ఈక్రింద వివరింపబడిన సాధనములవలనను, అందులకు విరుద్ధము కాని ఇతర సాధనముల మూలమునను ఈ ఉద్యమాభివృద్ధి కావింపబడును.

(క) బెజవాడ పట్టణమున ఆంధ్రదేశమున కంతకును కేంద్రగ్రంథాలయమును నిర్వహించుట.

(చ) ఆంధ్రదేశమున స్థాపింపబడునట్టియు, తదితరదేశములయందు ఆంధ్రులచే స్థాపింపబడునట్టియు, ధర్మగ్రంథాలయ సంఘములను, పఠనమందిరములను ఈ సంఘమునకు చేర్చుకొనుట, అట్టివానిని స్థాపించుట.

(ట) "మాజిక్కులాంతరులు" "సినిమెటోగ్రాఫులు" "బయస్కోపులు" మున్నగు యంత్రసామగ్రిని సేకరించి తన్మూలమున జనసామాన్యమునందు జ్ఞానాభివృద్ధిని కలుగ జేయుట.

(త) సంచారగ్రంథాలయములను నెలకొల్పి వానిని ఆంధ్రదేశమునందంతటను పంపి తన్మూలమున జ్ఞానాభివృద్ధిని జేయుట.

౨. ఆంధ్రదేశమునందును తదితర దేశములయందును శక్తికొలదిని ధర్మగ్రంథాలయోద్యమమునుగూర్చి జ్ఞానమును వ్యాపింపజేయుట.

3. ఆంధ్రసారస్వతమునందలి గ్రంథము లన్నిటికిని ప్రత్యేక ప్రాముఖ్యతతో ఇతర గ్రంథరాజముల కన్నిటికిగూడ పనికివచ్చెడి గ్రంథ విభజన పట్టికను తయారుచేసి ప్రచురించుట.

౪. (క) జనసామాన్యమునందు జ్ఞానాభివృద్ధి నొందుటకుగాను జ్ఞానాభివృద్ధి కరములగు గ్రంథములు, కరపత్రములు మొదలగువానిని ప్రచురించుట.

(చ) జనసామాన్యమునందు జ్ఞానాభివృద్ధికి సాధనములుగానుండు జాతీయ సంస్థాపనలను కాలానుసరణము లగునట్లు ఉద్ధరించుట.

౫. ఆంధ్రజాతీయ వికాసమునకును, ఆంధ్రవ్యక్తి వికాసమునకును సాధనభూతములగు సారస్వతము, విద్య, చిత్రకళలు, చరిత్ర పరిశోధన, మానవసేవ మున్నగు పరమార్థ కార్యములను జేయుట.

౬. ఈ సంఘము యొక్క ఉద్దేశములను గలిగిన ఇతర ప్రతిష్ఠాపనలతో కలిసి పనిచేయుట, అట్టివానితో సంబంధమును కలుగజేసికొనుట.

## నియమావళి

(Rules and Regulations)

I. సభ్యత్వము : సభ్యులు పదకొండు రకములుగ నుందురు.

**1. మహారాజపోషకులు :**

సంఘమునకు రు 1000-0-0 గాని, అంతకు తగ్గని స్థిరచరాస్తులనుగాని ఇచ్చువారు.

**2. రాజపోషకులు :**

సంఘమునకు రు 250-0-0 గాని, అంతకుతగ్గని స్థిరచరాస్తులను గాని ఇచ్చువారు.

**3. పోషకులు :**

సంఘమునకు రు 100-0-0 గాని అంతకు తగ్గని స్థిరచరాస్తులనుగాని ఇచ్చువారు.

4. సహాయులు:

సంఘమునకు రు 50-0-0 గాని, అంతకు తగ్గని స్థిరచరాస్తులనుగాని ఇచ్చువారు.

5. శాశ్వత సభ్యులు:

ఒకేసారి సంఘమునకు రు 25-0-0 గాని, అంతకు తగ్గని స్థిర చరాస్తులనుగాని ఇచ్చువారు.

6. సాధారణ సభ్యులు:

సంవత్సరమునకు రు 1-0-0 కు తక్కువగాని చందా చెల్లించువారు.

7. గౌరవ సభ్యులు:

పాలకవర్గమువారిచే సూచింపబడి సర్వసభ్యసభవారి ఆమోదమును బడసినవారు.

8. గ్రంథాలయములు - పఠనమందిరములు:

ఈ సంఘమునకుగాని, దీని శాఖాసంఘములకుగాని సంవత్సరమునకు రు 2-0-0 కు తక్కువగాని చందా చెల్లించునవి.

9. జిల్లా, తాలూకా, నగర గ్రంథాలయ సంఘములు:

10. గ్రామపంచాయతీబోర్డులు, సహకార సంఘములు:

11. మునిసిపాలిటీలు, జిల్లాబోర్డులు, సెంట్రల్ బ్యాంకులు, తదితర సంస్థలు:

సంవత్సరమునకు రు 5-0-0 చందా చెల్లించునవి.

II. నిర్వహణము:

1. సంఘవ్యవహారములు (1) ఒక అధ్యక్షుడు (2) నలుగురు ఉపాధ్యక్షులు (3) ఒక కోశాధిపతి (4) ఒక కార్యదర్శి (5) నలుగురు సహాయకార్యదర్శులు (6) పదునలుగురు సభ్యులు గల పాలక వర్గముచే నిర్వహించబడును.

2. (క) పాలకవర్గము సర్వసభ్యసభ వారిచే సంవత్సరమునకొకపర్యాయము మేనెలలో జరుగు వార్షికసభలో ఎన్నుకొనబడవలెను.
(చ) పాలకవర్గము నెన్నుకొనుటలో తెలుగుప్రాంతము లన్నిటికిని ప్రాతినిధ్య మిచ్చునటుల చూడవలెను.
(ట) పాలకవర్గములో సంవత్సర మధ్యకాలమున గలుగు ఖాళీలను పాలకవర్గమువారే భర్తీచేసికొనవచ్చును.

III. సభలు :

1. (అ) పాలకవర్గమువారు సంవత్సరమునకు కనీసము నాలుగు పర్యాయములైనను వేర్వేరు ప్రాంతములలో సమావేశమగుచుండవలెను
(ఆ) పాలకవర్గసభకు కనీసము ముగ్గురుసభ్యులైనను హాజరు కావలెను. అత్యావశ్యకమైన కార్యమున్నపుడు సభ్యులకు తెలియజేసి వారి లిఖితపూర్వక సమ్మతుల ననుసరించి తీర్మానముల చేయవచ్చును.

2. (అ) సర్వసభ్యసభ సాధారణముగా సంవత్సరమునకు ఒకతూరి సమావేశము కావలెను. అయితే సంఘాధ్యక్షులకు అవసరమని తోచినయెడల ప్రత్యేక సమావేశములను పిలువవచ్చును.
(ఆ) సర్వసభ్యసభకు కనీసము 15 గురు సభ్యులైనను హాజరు కావలెను.

3. (అ) పాలకవర్గములోని కనీసము ముగ్గురుకాని, సర్వసభ్యసభలోని కనీసము 15 మందిగాని సభ్యులు లిఖితపూర్వకముగ చర్చించవలసిన విషయములను తెలుపుచు కోరినయెడల ఆయా సంఘసమావేశములను, అట్టికోరిక అందజేయబడిన 15 దినములలోగా కార్యదర్శి జరుపవలెను. అటులజరుపుటకు కార్యదర్శి తప్పినయెడల అధ్యక్షునికి తెలిపి మరి వారములోపల వారును సమావేశ మేర్పరచనియెడల ఆసభ్యులే సదరు సమావేశములను సమకూర్చవచ్చును.
(ఆ) పాలకవర్గ సభలకు 5 పూర్ణదినములును, సర్వసభ్యసభలకు

10 పూర్ణ దినములను గడువుతో ప్రకటనలు సభ్యులకు పంపవలెను.

IV. సర్వసభ్యసభ :

సంఘముయొక్క అన్నిరకముల సభ్యులు నిందు పాల్గొనుట కర్హత గలిగియుందురు. పాలకవర్గము నెన్నుకొనుట, బడ్జెట్టులను, వార్షికనివేదికలను, ఉపనిబంధనలను అంగీకరించుట, సంఘముయొక్క అన్నివ్యవహారములపైనను అధికారము గలిగి యుండుట సర్వసభ్యసభయొక్క అధికారములు.

V. పాలకవర్గము :

సంఘనిబంధనల ననుసరించి సంఘవ్యవహారముల నడపుట, సర్వసభ్యసభలో చేయవలసిన తీర్మానముల నాలోచించి నిర్ణయించుట, సర్వసభ్యసభవారి ఆమోదమునకు లోబడి గౌరవ సభ్యులను సూచించుట, ఉపనిబంధనలను చేయుట, కార్యాచరణ కవసరమైన ఉపసంఘముల నియమించుట, సభ్యత్వ దరఖాస్తుల స్వీకరించుట, నిరాకరించుట పాలకవర్గమువారి విధులు.

VI. అధ్యక్షుడు :

సంఘముయొక్క అన్నిసభలకును అధ్యక్షతవహించుట, సంఘ వ్యవహారములన్నిటిని నిర్వహించుట అధ్యక్షుని విధులు.

VII. ఉపాధ్యక్షులు :

అధ్యక్షుడిచ్చిన అధికారమునుబట్టి వారిస్థానే వ్యవహరించుట, అధ్యక్షుడు లేనిసమయములలో క్రమముననుసరించి హాజరైన ఉపాధ్యక్షులలో ఒకరు వారిస్థానము నాక్రమించి సభావ్యవహారములను జరుపుట ఉపాధ్యక్షుల విధులు.

VIII. కోశాధిపతి :

పాలకవర్గమువారి తీర్మానము ననుసరించి సంఘముయొక్క ధనమును, ఆస్తిని జాగ్రత్తపరచి అందుకు సరియైన లెక్కలను, వోచరులను ఉంచుట కోశాధిపతి విధులు.

IX. కార్యదర్శి:

1. సంఘసమావేశములను సమకూర్చుట, సంఘపక్షమున ఉత్తర ప్రత్యుత్తరముల జరపుట, అధ్యక్షుని అధికారమునకులోబడి సంఘతీర్మానములను అమలుజరపుట, సంఘమునకు సిబ్బందిని ఏర్పరచుట, శిక్షించుట, తొలగించుట, పాలకవర్గము వారి తీర్మానము ననుసరించి సంఘద్రవ్యమును వినియోగించుట, వార్షికనివేదికలను, బడ్జెటులను తయారుచేయుట కార్యదర్శి విధులు.

2. సంఘముపై తేబడు అన్ని అభియోగములను, సంఘము వారితరులపై తెచ్చెడి అన్నిఅభియోగములను, కార్యదర్శి పేరట జరుపవలెను.

X. సహాయ కార్యదర్శులు:

పాలకవర్గము వారు ప్రత్యేకముగా నిర్దేశించినపనులను, కార్యదర్శి కోరినపనులను నెరవేర్చుచు కార్యదర్శి కన్నివిధముల సహాయపడుచుండవలెను.

XI. లెక్కలు - తనిఖీ :

తెలుగుసంవత్సరాదితో ఈసంఘముయొక్క లెక్కలు ప్రారంభమగును. ఈసంఘముయొక్క లెక్కలను ప్రతిసంవత్సరమును పాలకవర్గముచే నిర్ణయింపబడు తనిఖీదారునిచే తనిఖీచేయించవలెను.

XII. ప్రత్యేకనియమములు:

ఈసంఘముయొక్క నిబంధనలను పేటినైనను తొలగించుటకుగాని, క్రొత్తవానిని చేర్చుటకుగాని, ఉన్నవానిని మార్చుటకుగాని సర్వసభ్యసభ కధికారము గలదు.

## %. ఆం. దే. గ్రం. సంఘము: శాశ్వతసభ్యులు *

### మహారాజపోషకులు

శ్రీ కొమ్మా సీతారామయ్యగారు, పటమటలంక, బెజవాడ తాలూకా
,, సురవరము రంగారెడ్డిగారు, కొత్తూరు, ఆలంపూరుతాలూకా

### రాజపోషకులు

,, వాగినేని వెంకయ్యగారు, ధేనువకొండ, ఒంగోలు తాలూకా
,, పాతూరి నాగభూషణం గారు, పెదపాలెము, తెనాలి తాలూకా

### పోషకులు

,, జాస్తి తులశమ్మగారు, కాటిపూడి, తెనాలితాలూకా

### సహాయులు

,, యలవర్తి శ్రీరాములుగారు, యలవర్రు, తెనాలితాలూకా
,, వెనిగళ్ళ సత్యనారాయణరావుగారు, దుగ్గిరాల, తెనాలితాలూకా
,, ఆలపాటి సూర్యనారాయణరావుగారు, గోవాడ, డిటో
,, పిడికిటి సీతారామయ్యగారు, గుండిమెడ, పెదవడ్లపూడిపోష్టు, గుంటూరు తాలూకా
,, పాతూరి బుర్రయ్యగారు, పెదపాలెం, తెనాలితాలూకా
,, రాజాబహద్దరు వెంకటరామారెడ్డిగారు, హైదరాబాదు

### శాశ్వతసభ్యులు

,, కొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు, ఎం. ఏ., బి. ఎల్., 2 లజ్ చర్చిరోడ్, మైలాపూరు, మదరాసు
,, సామి వెంకటాచలంశెట్టిగారు, త్యాగరాయనగర్, మదరాసు
,, చుండూరు కన్నయ్యశ్రేష్ఠిగారు, నవాబుపేట, నెల్లూరు
,, ఊటుకూరు జయరామదాసుగారు, వేటపాలెం, బాపట్ల తా॥
,, యండ్లూరి సత్యనారాయణగారు, మాచవరం, పొన్నూరుపోష్టు
,, వెలగా కోటేశ్వరరావుగారు, డిటో డిటో
,, యండ్లూరి నాగయ్యగారు, డిటో డిటో
,, గడిపాటి కోటయ్యగారు, ప్యాపర్రు (వయా) పొన్నూరు
,, కొరటాల కృష్ణయ్యగారు, డిటో డిటో
,, ఆలపాటి వెంకటకృష్ణయ్యగారు, గోవాడ, తెనాలితాలూకా

* వ్యయసంవత్సరాంతాన

డాక్టరు యేజెళ్ళ శ్రీరాములుచౌదరిగారు, మారీసుపేట, తెనాలి.
శ్రీ శరణు లక్ష్మీనారాయణగారు, అమృతలూరు డిటో తా॥
,, శరణు సాంబశివరావుగారు, డిటో డిటో
,, పోశంశెట్టి రామమూర్తిగారు, అడవికొలను, తాడేపల్లిగూడెం
తాలూకా, ప.గోదావరిజిల్లా
,, నూతక్కి రంగయ్యగారు, చిలువూరు, కుమ్మపూడిపోష్టు
శ్రీమతి పాతూరి చంద్రిమౌళిక రాజేశ్వరమ్మగారు, పెదపాలెం
(వయా) దుగ్గిరాల
,, అవుదు తులశమ్మగారు, వల్లభాపురం (వయా) దుగ్గిరాల
,, బండి అన్నపూర్ణమ్మగారు, పటుచుటలంక (వయా) బెజవాడ

## శాశ్వత గౌరవ సభ్యులు

శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు, మదరాసు
డా॥ సర్ కట్టమంచి రామలింగారెడ్డిగారు, చిత్తూరు
,, మాడపాటి హనుమంతరావుగారు, ఆంధ్రకుటీర్
సుల్తాన్ బజారు, హైదరాబాదు (దక్కను)
శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారు, బెజవాడ
,, భూపతిరాజు తిరుపతిరాజుగారు, కుముదవల్లి, భీమవరం తా॥
,, నాళం కృష్ణరావుగారు, రాజమహేంద్రవరము
,, మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు, విశాఖపట్టణము

## ౬. ఆం. దే. గ్రం. సంఘము: తెలంగాణాసభ్యులు(వ్యయసం.)

## గ్రంథాలయములు

1. శ్రీకృష్ణదేవరాయల ఆంధ్రభాషానిలయం, హైదరాబాదు
2. విజ్ఞాననికేతనం, ఖమ్మంమెట్టు, వరంగల్ జిల్లా
3. సర్వజనాంధ్రగ్రంథాలయం, క్యాతూరు, రాయచూరుజిల్లా
4. చెన్నకేశ్వర గ్రంథాలయం, లంగస్వామి, రాయచూరుజిల్లా
5. బాలసరస్వతీగ్రంథాలయం, గౌలీగూడాచమన్, హైదరాబాద్
6. వెంకటేశ్వరగ్రంథాలయం, నాయకలగూడెం, వరంగల్లుజిల్లా
7. విద్యార్థిసంఘం, ఖమ్మంమెట్టు

8. జాతీయగ్రంథాలయం, జమ్మికుంట, కరీంనగర్ జిల్లా
9. ఆంధ్రవిజ్ఞాన ప్రకాశినీగ్రంథనిలయం, సూర్యాపేట, నల్లగొండజిల్లా
10. శ్రద్ధానంద హరిజనపాఠశాల గ్రం. ,, ,,
11. ప్రతాపరుద్ర ఆంధ్రభాషానిలయం, పానగల్లు (వయా) నల్లగొండ
12. ఆంధ్రగ్రంథాలయం, మిరియాలగూడెం, నల్లగొండజిల్లా
13. ప్రజాహితగ్రంథమండలి, డోర్నకల్లు, వరంగల్ జిల్లా
14. వివేకానందగ్రంథాలయం, శిరిపురం, ,,
15. యువజనగ్రంథాలయం, జనగాం, నల్లగొండజిల్లా
16. ఆంధ్రభాషానిలయం, సుల్తానాబాద్, కరీంనగర్ జిల్లా
17. శ్రీ ఆంజనేయ యువజనసంఘ గ్రంథాలయం, సికింద్రాబాద్
18. జాతీయపక్షగ్రంథాలయం, ఖమ్మంమెట్టు, వరంగల్ జిల్లా
19. నేతాజీకరనాలయం, ,, ,,
20. యువజనగ్రంథాలయం, ఇప్పగూడెం, నల్లగొండజిల్లా
21. శ్రీ సీతారామాంధ్రగ్రంథాలయం, ఘనపురం, వరంగల్లు జిల్లా
22. ఉమామహేశ్వర ఆంధ్రభాషానిలయం, సిద్ధిపేట, మెదక్ జిల్లా
23. ఆంధ్రగ్రంథాలయం, చేర్యాల, నల్లగొండ జిల్లా
24 సరస్వతీగ్రంథాలయం, మధిర, వరంగల్ జిల్లా
25. శ్రీవాసవిగ్రంథాలయం, కోదాడు, నల్లగొండజిల్లా
26. విజ్ఞాననికేతనము, హుజూర్ నగర్, ”
27. ఆంధ్రవిద్యాభివర్ధనీ గ్రంథాలయం, కోటపల్లి, కరీంనగర్ జిల్లా
20. ఉస్మానియా ఆంధ్రభాషానిలయం, కరీంనగర్, ”
29. ఆంధ్రగ్రంథాలయం, జగ్త్యాల, ”
20. శ్రీలక్ష్మీవెంకటేశ్వర ఆంధ్రభాషానిలయం, మానకొండూరు, కరీంనగర్ జిల్లా
31. శ్రీసీతారామపుస్తకభాండాగారం, కందిబండ, నల్లగొండ జిల్లా
32. పావనీగ్రంథాలయం, రఘునాథపల్లి, నల్లగొండ జిల్లా
33. సాహిత్యనిలయము, సుభ్రవీడు, వరంగల్ జిల్లా
34. యువక విజ్ఞాన సమితి, గద్వాలసంస్థానం, రాయచూరు జిల్లా

35. ఆంధ్రకేసరి గ్రంథాలయం, కొత్తగూడెం, వరంగల్ జిల్లా
36. సిద్ధమల్లేశ్వరాంధ్ర భాషానిలయం, రేమిడిచర్ల, వరంగల్ జిల్లా
37. రాజరాజనరేంద్ర ఆంధ్రభాషానిలయం, హనుమకొండ, వరంగల్ జి॥
38. నెహ్రూగ్రంథాలయం, బనిగండ్లపాడు, వరంగల్ జి॥
39. వేణుగోపాలగ్రంథాలయం, వేంసూరు, ,,
40. శ్రీరామ ఆంధ్రభాషానిలయం, బలపాల ,,
41. శ్రీనాథభాషానిలయం, చొప్పకట్లపాలెం, వరంగల్ జి॥
42. అష్టభాషా బహిరిగోపాలరాయాంధ్ర భాషానిలయం,
వనపర్తి సంస్థానం, మహబూబ్ నగర్ జి॥
43. తిమ్మినేనిపాలెంగ్రంథాలయం, తిమ్మినేనిపాలెం, వరంగల్ జి॥
44. విశ్వేశ్వరాయాంధ్రభాషానిలయం, హుజూరాబాద్, వరంగల్ జి॥
45. విద్యానాథాంధ్రగ్రంథాలయం, కస్తాల, నల్లగొండ జి॥
46 కవిరత్నాంధ్రగ్రంథాలయం, చండూరు, ,,
47. భారతీగ్రంథాలయం, రామాపురం, వరంగల్ జి॥
48. భారతీపఠనాలయం, సూడూరు, నల్లగొండ జి॥
49. జైహింద్‌గ్రంథాలయం, ఒడ్డేకొత్తపల్లి ,,
50. భారతమాతగ్రంథాలయం, ఇటికాలపాడు, రాయచూరు జి॥
51. ఆంధ్రగ్రంథాలయం, కరీమాబాద్, వరంగల్ జి॥
52. శ్రీరామచంద్ర ఆంధ్రగ్రంథాలయం, శంకరంపేట, (వయా)
హైదరాబాద్
53. శ్రీపాండురంగగ్రంథాలయం, మరుసూరు, నల్లగొండ జి॥
54. శ్రీనివాసగ్రంథాలయం, రుద్రంగి, కరీంనగర్ జి॥
55. రామకృష్ణగ్రంథాలయం, కడకుంట్ల, నల్లగొండ జి॥
56 యువజనపఠనాలయం, ఖమ్మంమెట్టు (నిజాంపేట)
57. సుభాసుచంద్ర ఆంధ్రగ్రంథాలయం, రంగశాయిపేట, వరంగల్ జి॥
58. శ్రీరామకృష్ణాంధ్రగ్రంథాలయం, శిరిపురం, ఆదిలాబాద్ జి॥
59. శ్రీ సీతారామాంజనేయ హిందూవర్తకగ్రంథాలయం,
ఇల్లెందు, వరంగల్ జి॥

60. దేశోద్ధారక ఆంధ్రభాషానిలయం, కుక్కునూరు, వరంగల్ జి॥
61. భారతీగ్రంథాలయం, రఘునాథపేట, మహబూబ్ నగర్ జి॥
62. జాతీయఆంధ్రగ్రంథాలయం, మాటేడు, వరంగల్ జి॥
63. శారదాగ్రంథాలయం, కంచిరేవుపల్లి, నల్లగొండ జి॥
64. గరిడేపల్లి కాంగ్రెస్ సమితి, గరిడేపల్లి, ,,
65. నరసింహాగ్రంథాలయం, మలతోరణాల
66. బాలసరస్వతీగ్రంథాలయం, మహబూబ్ నగర్
67. తెలుగుతల్లిగ్రంథాలయం, పల్లిగుట్ట, వరంగల్ జి॥
68. ఆంధ్రపఠనాలయం, పెద్దపల్లి
69. బాలగ్రంథాలయం, స్తంభంపల్లి, వరంగల్ జి॥
70. లచ్చుగూడెం పఠనాలయం, లచ్చుగూడెం, వరంగల్ జి॥
71. నెహ్రూగ్రంథాలయం, ఖమ్మంమెట్టు
72. భారతీయగ్రంథాలయం, సిరికొండ
73. జాతీయపఠనాలయం, కోటపాడు
74. శబ్దశాసనాంధ్రభాషానిలయం, రామన్నపేట, వరంగల్ జి॥
75. శ్రీగ్రామోద్ధారకగ్రంథాలయం, పెంచికలదిన్నె, నల్లగొండ జి॥
76. ప్రౌఢ సరస్వతీ వాచనాలయం ఆలంపూరు, రాయచూరు జి॥
77. శారదాగ్రంథాలయం, తారానగరం, (వయా) హైదరాబాద్
78. డాంగేపఠనాలయం, ఖమ్మంమెట్టు
79. ఆంధ్రవిజ్ఞానవర్ధనీభాషానిలయం, బెజ్జంకి, కరీంనగర్ జి॥
80. కస్తూరిబా గ్రంథాలయం, నల్లగొండ

## వ్యక్తులు

1. పైడిమర్రి సూర్యనారాయణగారు, కోదాడు, నల్లగొండ జి॥
2. కూరెల్ల వీరయ్యగారు, ఘనపురంస్టేషన్, వరంగల్ జి॥ 3-0-0
3 వార్సి యీశ్వరయ్యగారు, ఘనపురం, ,, 3-0-0
4. శిరిపురపు రాజలింగారాధ్యగారు, సిద్దిపేట, మెదక్ జి॥

5. పి. శేఖరంగారు, సిద్దిపేట, మెదక్ జిల్లా

6. అలాజపూరు లక్ష్మినారాయణగారు, సిద్దిపేట ,,

7. తాటికొండ విశ్వనాథంగారు, ,, ,,

8. ఉప్పుల విశ్వనాథంగారు, వకీలు, ,, ,,

9. ములుగు వెంకటేశంగుప్తగారు, ,, ,,

10. అక్కినేపల్లి వెంకట్రామారావుగారు, నలగొండ, నలగొండ జి॥ 5/-

11. పులిజాల వెంకటనరసింహారావుగారు, ,, ,, 5/-

12. నాగుబండి వెంకయ్యగారు, మిర్యాలగూడెం, ,, 2/-

13. తెడ్ల మట్టయ్యగారు, మిరియాలగూడెం, ,, 2/-

14. గంధం చంద్రయ్యగారు, ,, ,,

15. బోయిన కోటయ్యగారు, ,, ,, 2/-

16 చల్లా సీతారామారెడ్డిగారు, ,, ,,

17. చిటుపోలు మల్లిఖార్జునంగారు. ,, ,,

18. తెడ్ల పుల్లయ్యగారు, ,, ,,

19. చిటుపోలుసూర్యనారాయణగారు,, ,,

20. చీదెళ్ల రాములుగారు, ,, ,,

21. చిల్లంచర్ల లింగయ్యగారు, మిరియాలగూడెం, నలగొండ జి॥ 12/-

22. పారేపల్లి యల్లమందయ్యగారు ,, ,,

23. పూటుకూరు లక్ష్మయ్యగారు ,, ,,

24. తెడ్ల లింగయ్యగారు, ,, ,,

25. తెడ్ల రాములుగారు, ,, ,,

26. తిరునగరు విశ్వనాధంగారు, ,, ,,

27. గారు లింగయ్యగారు, ,, ,,

28. చీదెళ్ళ విశ్వనాథంగారు, ,, ,, 2/-

29. పయిడిమర్రి వీరయ్యగారు, గరిడేపల్లి, ,, 5/-

30. సంగెపు నారాయణగారు, ఖమ్మంమెట్టు, వరంగల్ జి॥ 5-4-0

31. అత్తలూరి రామనర్సుగారు ,, ,,

23. దొంత తిరపతయ్యగారు, సూర్యాపేట, నలగొండ జి॥

33. యామా రాధాకృష్ణగారు, సూర్యాపేట నల్లగొండజిల్లా 2/-
34. శుద్ధం శ్రీరామమూర్తిగారు, ,, ,,
35. ఓరుగంటి నరసయ్యగారు, ,, ,,
36. చక్కాల రంగారావుగారు, ,, ,,
37. తడకమళ్ళ హనుమంతరావుగారు, ,, ,,
38. యస్. విశ్వమిత్రజీ, ,, ,,
39. విశ్వనాథశర్మగారు, ,, ,, 5/-
40. ఓరుగంటి వెంకన్నగుప్తగారు, ,, ,, 5/-
41. భోయినేపల్లి విశ్వనాథరావుగారు, రావిపాడు, ,, 2/-
42. వెదిరె నారాయణరెడ్డిగారు, సూర్యాపేట ,, 5/-
43. భోనగిరి శంభయ్యగారు, ,, ,, 5/-
44. వెల్లుర్తి మాణిక్యరావుగారు, నలగొండ, నలగొండ జి॥ 5/-
45. కంచనేపల్లి వెంకట్రామారావుగారు యల్.యల్.బి., నలగొండ
46. భోయినేపల్లి వెంకట్రామ నరసింహారావుగారు, ,,
47. కంచినేపల్లి వెంకట్రామరావుగారు, ,, 5/-
48. ఎం. వెంకటేశ్వరరావుగారు, ,, 5/-
49. కొమర్రాజు సత్యనారాయణరావుగారు, ఖమ్మంమెట్టు
50 మారం నరసింగారెడ్డిగారు, క్యాతూరు, రాయచూరు జి॥
51 భోనగిరి రాములుగారు, సూర్యాపేట, నలగొండ జి॥
52. గుండా పాపయ్యగారు, ,, ,,
53. వెంపటి శేషాద్రిగారు, ,,
54. పాల్వాయి పుట్టయ్యగారు, ,, ,, 2/-
55. ఉప్పల వెంకన్నగారు, ,, ,, 4/-
56. యామా రామనరసయ్యగారు, ,, ,, 5/-
57. వీరవెల్లి నారాయణగారు, ,,
58. సురవరము ప్రతాపరెడ్డిగారు హైదరాబాదు
59. ఆకుల లక్ష్మినారాయణగారు, కొత్తగూడెం
60. కోదాటి నారాయణరావుగారు, ఖమ్మంమెట్టు